మీ కుటుంబానికి చీకూ–చింతాలేని భవిష్యత్తు గురించి ఆలోచించటం మీ గృహస్థ బాధ్యతకదా!

పిల్లల చదువులకు, పెళ్ళిళ్ళకు, ఇంటికి, మీ దగ్గర కావల్సినంత సొమ్ము ఉంటే ఎట్టి అవాంతరాలనైనా ఎదుర్కొనే ధైర్యం మీకుంటుంది ఆ ధైర్యాన్నివ్వటానికే **కెనరా బ్యాంకు** సదా మీకు తోడుగా ఉంటుంది.

నెల జీతంమీద ఆధారపడే వాళ్ళకు సులభతరంగా ప్రతినెలా నిర్ణీతమైన మొత్తాన్ని దాచుకోటానికి **రికరింగ్ డిపాజిట్** పథకం కెనరా బ్యాంకులో ఉంది.

మీ పిల్లల చదువుకోసం ఇప్పుడే **విద్యానిధి** పథకంలో చేరండి సొమ్ము మీ పిల్లలతోపాటు పెరుగుతుంది.

# మీ వాళ్ల భవిష్యత్తును గాలికి వదిలేస్తారా?

మీ ఉద్యోగ విరమణ తర్వాత మీకు ప్రతినెలా ఆదాయం కావాలంటే **నిరంతర డిపాజిట్ లో** మీరిప్పుడే చేరటం అవసరం. అందువలన మీ పెట్టుబడి ధనం తగ్గకుండా ప్రతినెల మీకు నిర్ణీతమైన ఆదాయం లభిస్తుంది

మీకు అనుకూలించే పథకాలను ఎన్నుకొని, మీ అవసరాలకు జాగ్రత్త పడండి. ఇంకా **కామధేను, ఫిక్సిడ్, సేవింగ్స్** పథకాలుకూడా మా బ్యాంకులో ఉన్నాయి.

నేడే మీకు దగ్గరలో ఉన్న మా బ్రాంచికి రండి. అది మీ బంగారు భవిష్యత్తుకే సుమండీ!




# కెనరా బ్యాంక్

(జాతీయ బ్యాంక్)

దేశము మొత్తమున **1,300** కు పైగా శాఖలు కలవు

maa (S) CB 14 b Tel 81



# ఇంటిల్లిపాది కేశ సంరక్షణ కోసం...
# విశ్వసించదగ్గది ఈ ప్రత్యేకమైన ఫామిలీ షాంపూ
# పామొలివ్






పామొలివ్ అన్ని రకాల జుట్టుకోసం ప్రత్యేకంగా సూత్రీకరించబడింది.
జుట్టుని బాగా శుభ్రపరిచే ఓ గొప్ప ఆధునిక షాంపూ ఇది.
అయినప్పటికీ, పిల్లలకు వాడదగ్గ కోమలత్వం దీనిలో ఉంది. ఇది,
జుట్టుని మృదువుగా, ఆరోగ్యంతో నిగనిగలాడేలా చేస్తుంది.
అంతేకాదు, పామొలివ్ షాంపూ కుటుంబ బడ్జెట్‌కు అనువైంది. ఎందుకంటే,
ఇటువంటి షాంపూల్లో అతి పొదుపైన ధరకు దొరికేది ఇదే!

## మీ బడ్జెట్‌కు అనువైన కుటుంబ కేశ సంరక్షణ

GK&E.PS.7 TL

## లోకంపోకడ ✻ ఊరిమెన్











# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
[1938–1972]
శుక్రవారం : 16–10–'81
దుర్మతి నామ సం. ఆశ్వయుజ బ. తదియ
సంపుటము 75 : సంచిక 6
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ
*
పోస్టులో ఏడాది చందా రు. 67–60
ఆరు మాసాల చందా రు. 33–80
విడి ప్రతి వెల రు. 1–50 పైసలు
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

కేవలం 1000 రూపాయల పెట్టుబడితో మీ కుమారుడు పట్టభద్రుడు కాగలడు



కేవలం 5000 రూపాయలతో మీ కుమార్తెకు ఘనంగా పెళ్ళి చేయగలరు.



కేవలం 10000 రూపాయలతో ఉద్యోగ విరమణ అనంతరం మీ జీవితాన్ని హాయిగా గడపగలరు.



# అందుకోసం సౌత్ ఇండియన్ బ్యాంకు కల్పకనిధి పథకం క్రింద డిపాజిట్ చేయండి.

ఇది మీకు నమ్మశక్యం కాకపోవచ్చు. కాని ఇది అక్షరాలా నిజం. మీరు సౌత్ ఇండియన్ బ్యాంకు కల్పకనిధి పథకం క్రింద డిపాజిట్ చేసిన రు. 1000/-లు రు. 5000/- లకు రు. 10,000 కి పెరుగుతాయి. ఈ విధంగా పదేళ్ళలో మీ డబ్బు ఇప్పటికి ముమ్మడిగా పెరుగుతుంది. వడ్డీకి వడ్డీ పెరుగుతుంది.

కనుక, సౌత్ ఇండియన్ బ్యాంకు కల్పకనిధి పథకం క్రింద పెట్టుబడి పెట్టండి. భవిష్యత్తు గురించి యోచన చేసేవారికి ఇది చక్కని పథకం. తమకు, తమ కుటుంబాలకు సుఖ జీవనం కావాలనుకొనేవారికి ఇది మంచి పథకం. మీకు అవసరమైనంత మేరకు, సాధ్యమైనంత కాలం దాచుకొనటానికి తోడ్పడే పథకం ఇది. నూరు రూపాయలు లేక అలాంటి మార్లు ఎన్నయినా 12 నెలలు మొదలు 120 నెలలదాకా డిపాజిట్ చేసుకొంటూ పోవచ్చు. మీ సమీపంలో ఉన్న సౌత్ ఇండియన్ బ్యాంకు బ్రాంచికి వెళ్ళండి. మీ భవిష్యత్తుకు భద్రత చేకూర్చుకొనండి.



ది సౌత్ ఇండియన్ బ్యాంక్ లి.

రిజిస్టర్డ్ ఆఫీసు: తిరుచూరు, కేరళ

SIB/7/81/TEL

**శుభాకాంక్షలు!**

మా పాఠకులు, రచయిత(త్రు)లు, ప్రకటనకర్తలు, ఏజంట్లు అందరికీ మా దసరా శుభాకాంక్షలు —సం.

# త్వరలో ప్రారంభం!

కొత్త సీరియల్

# జీవిత వనంలో కొత్త గాలి

రచన

కుందుర్తి ఇందిరాదేవి

### ముఖచిత్రం

18.9.81వతేదీకళ్ళా మామణి శ్రీమతి సుజాత గారి ముఖచిత్రంతో వెలువడిన సచిత్ర వారపత్రిక అత్యంత ఆకర్షణీయంగా ఉంది. ముఖ్యంగా ఈకథ సుఖాంతం చేయరనా? కథ చాలా బాగుంది.

ప్రతాప్ (వైజాగ్)

### సీరియల్

18.9.81 నాటి ఆంధ్ర సచిత్ర వార పత్రిక ముచ్చటైన ముద్దు గులాబీ పువ్వులాగ ముద్దు ముద్దుగా మా ముందుకు వచ్చింది. 'సాగర మథనం' సీరియల్ ఇంటరెస్టింగ్‌గా సాగిపోతూ మళ్ళీ వారం కోసం ఆత్రంగా ఎదురు చూసేలా చేస్తోంది.

వేమూరి శ్రీవాణి, రజని (కరీంనగర్)

* * *

సుజాత ముఖ చిత్రంతో వెలువడిన మా (మా) ఆంధ్ర పత్రిక రమణీయంగా ఉంది. వర్ల్పింగ్ హెవెన్ సీరియల్ కొరకు వారం, వారం ఎదురు చూసేలా చేస్తోంది. సాగరమథనం సీరియల్ ఆసక్తిదాయకంగా ఉంటోంది.

రాకుర్తి సత్యనారాయణ, శ్రీనివాస్ (కాకినాడ)

* * *

సుజాత ముఖ చిత్రంతో వెలువడిన సంచికలో 'విధి చాల ముఖమా' పెద్ద కథ బాగున్నది. సీరియల్స్ రెండూ చాల బాగున్నవి.

ఎ. రాజలక్ష్మి శాస్త్రి (కుప్పకూరు)



### కార్టూన్‌లు

మా అభిమాన నటి సుజాత ముఖచిత్రంతో వెలువడిన సంచికలో కథ 'ఇంక్రిమెంట్' వచ్చింది. ఊమెన్‌గారి లోకం పోకడలోని కార్టూన్లు నవ్విస్తూ చాలా అర్థవంతంగా ఉంటున్నాయి.

జి. రవీందర్ రెడ్డి, జి. వెంకటరెడ్డి (పద్మారావ్ బేగంపేట)

* * *

18.9.81నాటి పత్రిక నటి సుజాత ముఖ చిత్రంతో అత్యంత శోభాయమానంగా ఉంది. ముఖ్యముగా 48, 57 పేజీలలోని కార్టూన్‌లు అత్యంత హాస్యముగానున్నాయి.

ఎన్. చిట్టిబాబు (విజయవాడ)

### కథలు

18.9.81వ తేదీనాటి ఆంధ్ర సచిత్ర వార పత్రిక అత్యంత్య ఆకర్షణీయంగా ఉంది. 'ఇంక్రిమెంటు' కథ సందేశాత్మకంగా ఉంది.

కె. తులసీరావు (గాజుల గుంట)

* * *

18.9.81 సంచికలో ప్రచురించి కథలన్నీ కొత్త పోకడల్లో వినూతనంగా ఉండి మనసును ఆకట్టుకునేలా ఉన్నాయి.

కొమ్మినేని ప్రసాద్, అనంత్ (గుంటూరు)

* * *

18.9.81 సుజాత ముఖ చిత్రంతో వెలువడిన ఆంధ్ర పత్రిక చక్కగా ఉన్నది. 'ఈ కథ సుఖాంతం చేయరనా!' 'ఇంక్రిమెంటు' కథలు బాగున్నవి.

అలమూరు థామస్ డేనియల్ (విశాఖపట్నం)

* * *

ఆంధ్రసచిత్ర వారపత్రిక (18.9.81) లోని కథలు ఎంతగానో బాగా ఉన్నాయి. 'ఇంక్రిమెంట్' ఎంతగానో నన్ను ఆకర్షించింది.

టి. మోహన్‌రావు (మార్కాపురం)






మధ్యాహ్నం సాయంత్రం వచ్చింది సుధ. ఆమె వచ్చేసరికి రవి లేడు. కవిత ఏదో డిజైన్ కుట్టుకుంటూ కూర్చుంది. "హాయ్, సుధీ" అంది ఆమెను చూసి.

"అబ్బ! ఏం సెలవలో కాని వచ్చి పోతున్నాం. ఏమీ తోచడం లేదు." అంది సుధ కవిత పక్కన కూర్చుంటూ.

"అందుకే సెలవుల్లో కాకినాడ పోతున్నా" అంది కవిత.

"యిది అన్యాయమే, కవీ. సెలవలొంటరిగా బోర్ కొట్టి చచ్చిపోతాను."

"మా బామ్మ తప్పకుండా వెళ్ళా లంటోంది. మమ్మీనీ డాడీనీ చూసి చాలా కాలమైంది. నాకూ వెళ్ళాలనే వుంది."

'రవి వెళ్ళిపోతాడు, కవిత వెళ్ళిపోతుంది. సెలవల్లో ఎలా గడపడం?' దిగులుగా నిట్టూర్చింది సుధ మనసు. గోపీనాథ్ ఎక్కడయినా ఎదురౌతాడేమోనని సుధ ఒంటరిగా ఎక్కడికీ వెళ్ళడం మానుకుంది.

"పోనీ నువ్వుకూడా నాతో రాకూడదూ!" అంది కవిత సుధ దిగులుగా వుండడం చూసి.

(గత సంచిక తరువాయి)

కవిత సలహా బాగానే వుందనిపించింది సుధకి. కవితావాళ్ళ డాడీ, మమ్మీ దగ్గర సుధకి కూడా చనువే!

"నీ అయిడియా బాగానే వుంది. నీతో నేనుకూడా వస్తాను. నాలుగురోజులుండి వచ్చేస్తాను." అంది సుధ.

"సుగుణ దగ్గర కెళ్దామా యివాళ?" అంది కవిత కుట్టడం పూర్తయ్యాక.

"రవి లేరు. ఎలా వెళ్తాం?"

"మనం యిద్దరమే వెళ్దాం. యిల్లు తెలుసుకదా!" అంది కవిత.

కాఫీలు తాగి యిద్దరూ బయలుదేరారు రిక్షాలో.

సుగుణ యిద్దర్నీ సాదరంగా ఆహ్వానించింది. ఆడుకుంటూ కూర్చున్న బాబు వాళ్ళని చూసి మెల్లగా నడుస్తూ వాళ్ళదగ్గర కొచ్చాడు. సుధ బాబుని ఎత్తుకుని ముద్దు పెట్టుకుంది. "ఈ బాబుని నేను తీసుకుని వెళ్ళిపోతానండీ." అంది కూర్చుంటూ.

"మరో రెండు సంవత్సరాలాగితే నువ్వు వద్దన్నా మీ యింటిలో ఒక బాబు తయారౌతాడు." అంది సుగుణ నవ్వుతూ.

సిగ్గుతో తలదించుకుని అంది సుధ- "నే నసలు పెళ్ళి చేసుకోనండీ."

"ఓహో! పెళ్ళికి తొందరపడే ప్రతివారూ అనే మాటలే యివి. నేనూ నీలాగే అనేదాన్ని చదువుకునే రోజుల్లో. యీ మనిషిని చూసిన తర్వాత ఆ మాటలన్నిటినీ మూట కట్టేసి వచ్చేసాను."

సుగుణ మాటలకి సుధా, కవితా నవ్వుకున్నారు.

ఎందుకు నవ్వుతున్నారో తెలియక పోయినా వాళ్ళని చూసి బాబు కూడా నవ్వేసాడు.

ముగ్గురూ కాస్త చదువుకున్నవారే కనుక వాళ్ళ సంభాషణ అల్లికలూ కుట్లూ మొదలుకొని అణ్వస్త్రాల వరకూ సాగింది.

సుధా, కవితా లేవడానికుపక్రమిస్తుంటే అంది సుగుణ — "కవితా, నీకో మంచి ప్రపోజల్ వచ్చింది."

**జరిగిన కథ - 6 :** ఓ కాలేజీలో లెక్చరర్‌గా పని చేస్తుంటాడు రవీంద్ర. తన స్టూడెంట్ కవిత ఇంట్లో ఓ పోర్షను అద్దెకు తీసుకొంటాడు. మిత్రుడు శంకరంతో కలసి సినిమాకి వెళ్లిన అతనికి ఆ హాల్లో ఎకనమిక్స్ లెక్చరర్ గోపీనాథ్ ప్రక్కన కూర్చున్న యువతిని ఎక్కడో చూసినట్లు జ్ఞాపకం. లోగడ తను పెళ్లి చూపుల్లో చూసిన సుధే ఆ యువతి అని రవీంద్రకు గుర్తు వస్తుంది. రవీంద్ర పట్ల సుధ తన అయిష్టతను చూపుతుంటుంది. సుధను లోబరుచుకొని తనవెంట తిప్పుతున్న గోపీనాథ్ దుర్మార్గుడని సరళాదేవి ద్వారా తెలుసుకున్న రవి, ఆమెను కాపాడే విధానాలను గురించి ఆలోచిస్తుంటాడు. ఓ రోజు 'గోపీనాథ్ మంచివాడు కాదు' అని సుధతో చెప్పి ఆమెచే చీవాట్లు తింటాడు రవి. 'బర్త్‌డే'ని నమ్మి యింటికి వచ్చిన సుధను గోపీనాథ్ చెఱచ ప్రయత్నిస్తుండగా రవి రక్షిస్తాడు. అతనికి తన మనసులో చోటిస్తుంది సుధ. రవితో కవిత పెళ్లి చేయాలని నిశ్చయించుకొంటుంది బామ్మగారు. కవిత కూడా రవికి తన మనసులో చోటిస్తుంది. పరీక్షలైపోయిన తర్వాత సుధ, కవిత, రవి, శంకరం, సుగుణ పిక్నిక్ ప్రోగ్రాం అరకాపలి వెళ్లిచూసి తిరిగి వివరి స్థానాలకు వారు చేరుకొంటారు

"స్వీట్ న్యూస్! కవీ, వెంటనే పార్టీ యివ్వాలోయ్!' అంది సుధ సంబరంగా.

"అమ్మో! మీరు పెళ్లిసంబంధాలు కూడా చూస్తున్నారేమిటి? మా సుధ పెళ్లి జరిగాకే నేను చేసుకునేది కనుక మీరు దీనికి చూడాలి మొగుణ్ణి"అంది కవిత సుధ భుజాలు పట్టుకుని.

"ఇంతకీ సుగుణగారూ, వివరండీ ఆ అదృష్టవంతుడు?" అంది సుధ కుతూహలంగా

"మీకు తెలియని వాడేంకాదు. మా రవీంద్రే!"

సుగుణ మాటలు ములుకుల్లా తగిలాయ్ సుధకి. తనని ఎవరో భూమిలోకి అణచి వేస్తున్నట్లుగా క్రుంగిపోయింది. కవిత సిగ్గుతో కుంచించుకు పోయింది సంతోషంతో మనసు విహంగంలా విహరిస్తోంది.

సుధ సంబాళించుకుని అంది – "హార్టీ కంగ్రాట్స్, కవీ!"

"ఛ! పోవే" కోపం నటించింది కవిత.

రిక్షాలో సుధ ఏమీ మాట్లాడలేదు. తీయటి ఊహలో మునిగి తేలుతూన్న కవిత ఆమెను పట్టించుకునే స్థితిలో లేదు

సుధ యింటికి ఎలా చేరుకోగలిగిందో ఆమెకే తెలియదు బెడ్‌మీద బోర్లా పడుకుని తలగడలో ముఖం దాచుకుని వెక్కి వెక్కి ఏడుస్తోంది. జరిగిన సంఘటనలన్నీ ఆమెకు తెరలు తెరలుగా గుర్తుకొస్తున్నాయి. అన్నింటిలోనూ తను ఓడిపోయింది.

కలవారింటిలో ఏకైక సంతానంగా పుట్టిన సుధలో చిన్నతనంనుండీ కొంత దర్పం చోటు చేసుకుంది. కాస్త జ్ఞానం వచ్చేసరికి అది మరింత పెరిగిందే కాని తగ్గలేదు. ఆమె దృష్టిలో తమ స్టేటస్‌లో వున్నవారే తప్ప మామూలు మనుషులకు చోటు లేదు. అట్టి స్థితిలోనే రవితో పెళ్ళిచూపులు జరిగాయ్. స్వతహాగా అందగాడైనా ఒక మామూలు లెక్చరర్ కావడంవలన సుధ రంగుటద్దాలకి అతను సరిఅయిన వాడిలా కనిపించలేదు. అతని భయం, అమాయకత్వం చూసినతర్వాత అతన్నొక అసమర్థునిలా జమకట్టేసింది. ఆమె దృష్టిలో మగవాడంటే ఠీవిగా, చేతిలో సిగరెట్‌తో 'డోంట్ కేర్ మాష్టర్'గా వుండాలి

కాలేజీలోకి అడుగుపెట్టిన కొంత కాలానికి గోపీనాథ్‌తో పరిచయమేర్పడింది. అన్నివిధాలా తనూహించుకున్న 'మగవాడు' అతనిలో కనిపించాడామెకు కాలెజీ ప్రిన్సిపాల్‌కే కారు లేదు. గోపీనాథ్ మాత్రం దర్జాగా కారులో వస్తాడు రోజూ గోపీపట్ల వ్యామోహం పెంచుకుంది. గోపీనాథ్ తన దుష్టచర్య వలన ఆమె కళకున్న రంగు టద్దాలు తొలగించాడు రాయి ఏదో రత్నమేదో గ్రహించ గలిగింది. ఏదైనా వస్తువు పోగొట్టుకున్న తర్వాత దాని విలువ తెస్తుంది. రవిని నిండు మనసుతో ఆరాధిస్తోంది. కాని ఏం లాభం? సమయం మించిపోయింది! తను జారవిడిచిన రత్నాన్ని మరొకరు ఏరుకున్నారు ఎంత డబ్బు? ఎంత హోదా వున్నా ప్రయోజనం ఏమిటి? ప్రతీసారీ ఓటమి ఎదురైంది తనకి! చక్కటి గుణపాఠం నేర్పాడు భగవంతుడు. అయినా తను రవిని విడిచి వుండగలదా?

వెక్కి వెక్కి ఏడుస్తోంది సుధ గదంతా చీకటిగా వుంది. కారు హార్న్ విని కళ్ళు తుడుచుకుని నిద్రపోతున్న దానిలా నటిస్తూ పడుకుంది.

"సుధా, ఏమిటమ్మా యిలా చీకటిలో పడుకున్నావ్?" తట్టి లేపింది కౌసల్య.

"తలనొప్పిగా వుందమ్మా" అంటూ ముడుచుకుని పడుకుంది సుధ

"అమృతాంజనం రాయమంటావా?" సుధ పక్కనే కూర్చుని ఆమె తలని ఒడిలోకి తీసుకుంది కౌసల్య. చల్లటి ఆమె ఓదార్పు మాటలకి దుఃఖం ముంచుకొచ్చింది సుధకి.

"అమ్మా" అని కౌసల్యని పెనవేసుకుని బావురు మంది. కలవర పడింది కౌసల్య

"ఏమైందమ్మా?" సుధ ముఖాన్ని గుండెలకు హత్తుకుంటూ అడిగింది.

సుధ నటువంటి స్థితిలో విన్నడూ



చూడలేదు కౌసల్య. "ఏమండీ" అని భర్తని గట్టిగా పిలిచింది.

"సుధా, ఏం జరిగింది తల్లీ" శ్రీపతి వచ్చి ఆదుర్దాగా అడిగేడు

కారు మబ్బులకు చల్లటి గాలి సోకితే వర్షిస్తాయే తప్ప చెదరిపోవు కౌసల్య, శ్రీపతుల లాలన దుఃఖాన్ని పెంచుతోంది. వారి ఆందోళన ఎక్కువయింది సుధ బదులు చెప్పకపోవడంతో. పసితనంలో పిల్ల లేడుస్తే ఆకలి వలనా, ప్రాకు లేసుకుని పలకా బలపం పట్టుకుని బడికిపోయే వయసులో ఏడిస్తే తోటి పిల్లలతో ఏవో గిల్లికజ్జాలు పెట్టుకోవడం వలనని తల్లిదండ్రులనుకోవడం కద్దు. కాని వయసు తెచ్చిన ఒంపు సొంపులతో బింపుగా కాలేజీలో చదువుకునే అమ్మాయి అలా ఏడుస్తోందంటే ఏ తల్లిదండ్రులకైనా కలిగే అనుమానం ఆమె ఎవరిచేతనో మోస గింప బడిందని !

ఏడ్చి ఏడ్చి నిద్రపోయింది సుధ. శ్రీపతి, కౌసల్యా ఆమెనిక విసిగించక ఎవరి పనుల్లో వారు పడ్డారు. యిద్దరి మనసులూ తీరని వ్యథతో నిండివున్నాయి. సుధనెంతో గారాబంగా పెంచారు. ఆమెకేం కావాలన్నా సమకూర్చుతున్నారు. ఆమె ఎందు కేడుస్తోందో తెలియక తికమక పడుతున్నారిద్దరూ. 'ఫలానా' జరిగి వుంటుందని అనడానికి సాహసించలేకపోతున్నారు.

* * *

# సాగర మథనం

కవిత రవితో మునుపటిలా ఫ్రీగా వుండలేక పోతోంది. అతనిని చూడగానే సిగ్గు ముంచుకువస్తోంది. ఆమెలో వచ్చిన మార్పు రవి గమనించకపోలేదు. చిన్న పిల్లలా గలగలా మాట్లాడే కవితలో హఠాత్తుగా వచ్చిన మార్పు రవికి అంతుపట్టలేదు.

అరకావల్లి నుండి వచ్చినదగ్గరనుండీ సుధని కలుద్దామనుకుంటూనే కలియలేక పోతున్నాడు. సుధ కవిత దగ్గరకి రావడం లేదు.

చివరకో రోజు తెగించి సుధావాళ్ళ యింటికి బయలుదేరాడు. యింటికి తాళంవేసి వుంది. తిరుపతి వెళ్ళారని చెప్పాడు వాచ్‌మేన్.

తిరిగి వస్తూండగా అతని మనసేదో కీడు శంకించింది. "సుధ ఎందుకిలా చెప్పకుండా హఠాత్తుగా వెళ్ళిపోయింది? తనూహించి నట్టుగా సుధ నిజంగా గోపి చేత మోసగించ బడిందా? కాని ఆ రోజు ఆమె ప్రవర్తన చూపిన తర్వాత ఆమె హద్దుమీరి నట్టనిపించడం లేదు. అయినా తన మనసెందు కింకా సుధ చుట్టూ పరిభ్రమిస్తోంది? సుధ పట్ల తను పెంచుకున్న ప్రేమ పూర్తిగా చచ్చిపోలేదా? సుధ కనిపించకపోతే తన మనసెందుకిలా విల విల లాడిపోతోంది?" ఆలోచనల్లో తేలుతూ నీరసంగా యిల్లు చేరాడు. తలుపు తెరుస్తూండగా కవిత వచ్చింది "బామ్మ పిలుస్తోందం"టూ.

"నువ్వు రాజమండ్రి ఎప్పుడు వెళ్దామను కుంటున్నావు, బాబూ?" అన్నారావిడ.

"ఈ శుక్రవారమేనండీ" అన్నాడు మామూలు ధోరణిలో.

"మేం కూడా కాకినాడ వెళ్దామనుకుంటున్నాం, కలిసే బయలుదేరదాం మేం సామర్లకోటలో దిగిపోతాం."

"అట్లాగేనండీ" అన్నాడు రవి.

కవిత కళ్ళు సంతోషంతో మెరిసాయ్ !

* * *

సుధ రాక కోసం ఎంతో ఎదురుచూశాడు రవి. అతను బయలుదేరవలసిన రోజు రానే వచ్చింది. సుధ మాత్రం రాలేదు. సుధ వచ్చేవరకూ ప్రయాణం పోస్ట్‌పోన్ చెయ్యాలనుకున్నాడు. కాని తనతోబాటు కవితా, బామ్మగారూ ప్రయాణ మౌతూండడం వలన ఆరోజు బయలుదేరక తప్పలేదు.

అయిష్టంగానే రైలెక్కాడు. ఏదో పోగొట్టుకున్న వాడిలా బాధపడుతూ కిటికీ పక్క సీటులో కూర్చున్నాడు. ఎదురుగా కవితా, బామ్మగారూ కూర్చున్నారు. పుస్తకం చదువుతున్నట్టుగా నటిస్తూ పేజీలు తిరగేస్తున్నాడు. రైలు దూసుకుపోతోంది అరకాపల్లి స్టేషను దాటిన తర్వాత కవిత ఉత్సాహంగా తాము చూసిన ప్రదేశాలన్నీ చూపించింది బామ్మగారికి.

రాజమండ్రి వరకే వెళ్ళే రైలు కనుక పెట్టెలో జనం ఎక్కువగాలేరు. రవి డల్‌గా వుండడం చూసి అంది కవిత—"మాష్టారూ, అదోలా వున్నారు, వంట్లో బాగా లేదా?"

"అబ్బే ! ఏం లేదండీ, కాస్త తల భారంగా వుంది. అంతే" అన్నాడు రవి.

"కొద్దిగా టీ తీసుకోండి. తగ్గుతుంది." అంది కవిత ఫ్లాస్క్ మూత తీస్తూ.

"వద్దండీ. ఎలాగూ వచ్చేది తుని కదా, అక్కడ దిగి తాగుతాను" అన్నాడు మొహమాటంగా. చల్లటి గాలి వీస్తూ వుండడం వలన బామ్మగారికి కునుకు పట్టింది.

"ఈ మధ్య మీరదోలా వుంటున్నారు. నామీద కోపముస్తే కొట్టండి, తిట్టండి, కాని యిలా ముభావంగా మీరు కూచుంటే యీ కిటికీలోంచి దూకేస్తాను" అంది మెల్లగా. ఆమె నిజంగా బాధపడుతోంది. ఈ మధ్య రవి దిగులుగా వుంటూండడం ఆమె గమనిస్తూనే వుంది.

కవిత మాటలకి అదిరిపడ్డాడు రవి. ఆమె



# సూపర్ రిన్‌తో తళతళలాడే తెలుపు



## మరే ఇతర డిటర్జంట్ బిళ్ల లేదా బార్ కంటే తెలుపు

మీ బట్టలకు కళ్లు తిప్పుకోలేనంత తెల్లదనం—క్రమం తప్పకుండా సూపర్ రిన్‌తో ఉతికితే వాటి తెల్లదనం అద్వితీయం. మరే ఇతర డిటర్జంట్ బిళ్ల లేదా బార్ కంటే మరింత తెల్లటి తెలుపునిస్తుంది సూపర్ రిన్. ఎందుకంటే, సూపర్ రిన్‌లో తెలుపు చేసే శక్తి ఎక్కువ.




దీని తెలుపు చేసే శక్తిని మీకు మీరే
ఋజువు చేసుకోండి :

మరే ఇతర డిటర్జంట్ బార్‌తోనైనా ఉతికినది



సూపర్ రిన్‌తో ఉతికినది

హిందూస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పాదన.

# సాగర మథనం

మాటలెవరయినా విన్నారేమోనని పక్కకు చూసాడు. కాని ఆ సీట్లలో ఎవ్వరూ లేరు.

"ఛ! అలా ఏందుకనుకుంటున్నారు? యిలా యివ్వండి" అంటూ ఆమె చేతిలోని గ్లాసు అందుకున్నాడు.

తుని స్టేషన్‌లో దిగి సులోచనా రాణి నవలలు రెండు కొని తెచ్చి కవిత కిస్తూ అన్నాడు—"యివి మీరు చదివేసారా?"

వాటిలో ఒకటి చదివేసినా లేదని తలూపి అందుకుంది కవిత.

"సెలవల్లో ఏం చేస్తారు?" అంది అతను వచ్చి కూర్చోగానే

"అమ్మతో కబుర్లు చెబుతూ కూర్చుంటాను" అన్నాడు నవ్వుతూ.

"కాకినాడ రాకూడదూ" అంది ఓరగా చూస్తూ.

"వీలుచిక్కితే తప్పకుండా వస్తాను. అడ్రసివ్వండి" అన్నాడు.

కవిత బేగ్ తెరిచి చిన్న కాయితం మీద అడ్రసు రాసి యిచ్చింది. "మీ అడ్రసు దీని మీద రాసివ్వండి."అంటూ పెన్నూ, కాయితం యిచ్చింది రవికి.

"నేను రావడం మానేస్తే మీరు వస్తారా?" అన్నాడు అడ్రసు రాస్తూ.

"అమ్మో! అంత సాహసం చెయ్యలేను. ఉగాది గ్రీటింగ్స్ పంపుదామని."

"ఓహో ఉగాది దగ్గర పడినట్టుంది మరచిపోయాను."

సామర్లకోటలో దిగిపోయారు కవితా, బామ్మగారూ, రవిని తప్పకుండా రమ్మని చెప్పారు యిద్దరూ దిగిపోతూ.

## 9

వారం రోజులు గడిచేసరికి ఎన్నో నెలల్లే వట్టనిపించింది రవికి. ఏ పనీ లేకుండా కూర్చోడం చిరాకనిపిస్తోంది. వారం రోజుల్లో ఐదారు సినిమాలు చూసాడు. సుధ గూర్చి ఆలోచనలు వెంటాడుతూనే వున్నాయి.

ఉగాది రెండు రోజులుందనగా కవిత దగ్గర నుండి గ్రీటింగ్ వచ్చింది. ఆర్తితో కృష్ణుడ్ని అల్లుకుపోతూన్న రాధ! శృంగారం పాళ్ళు కాస్త ఎక్కువగా కలిపిగీసిన బాపుబొమ్మ అది! 'మీ కవిత' అని క్రింద రాసివుండడం చూసి ఆలోచనల్లో పడ్డాడు రవి. 'కవిత తనని ప్రేమిస్తోందా? ఏం చూదామన్నా

**నిలువెంటే లోపం లేని అమ్మాయి కవిత!** కాని కవితని తను ఆవంటి దృష్టితో చూడడంలేదే! తన హృదయంలో సుధకి తప్ప యింకెవ్వరికీ స్థానం కల్పించలేదు. మరి కవితకేమని సమాధానం చెప్పాలి? ఆమెతో తను అంత సన్నిహితంగా ప్రవర్తించడం తప్పా?'

యిరుకున పడ్డాడు రవి.

ఉగాదికి పరంధామయ్య అందరికీ బట్టలు తీసుకుని వచ్చాడు. వచ్చినదగ్గరనుండీ జానకమ్మతో అంటూనే వున్నాడు – "చెల్లాయ్, యీ సంవత్సరమైనా వీడికి పెళ్ళి చెయ్యదలచుకున్నారా, లేదా?"

"మంచి సంబంధం ఏదైనా వస్తే చేసేస్తాం అన్నయ్యా" అంటోంది జానకమ్మ.

అసలే అల్లకల్లోలపు మనస్సుతో అవస్థపడుతున్న రవిలో రామారావు రాక తుఫాను సృష్టించింది. రేపు ఉగాది అనగా వచ్చాడు రామారావు కవితని రవికి మాట్లాడడానికి. అతని రాక పరంధామయ్య కానందకరంగా వుంది.

"ఏంవోయ్, వాళ్ళమ్మాయి నీకు తెలుసట కదూ!" అడిగాడు మేనల్లుణ్ణి.

తెలుసన్నట్టుగా తలూపాడు రవి.

"అమ్మాయి ఎలాగుంటుంది? బావుంటుందా?"

ఏం చెప్పాలో తోచలేదు రవికి. ఏ లోపమూ లేని కవిత బావుండదని ఎలా చెప్పగలడు?

"చక్కగా వుంటుంది." అనేసాడు తనకి తెలియకుండానే.

"శభాష్" అంటూ ఒక్క వుదుటన లేచి హాల్లోకి వచ్చి, "మా వాడి అభ్యంతరం ఏమీ లేదండీ. యిక మనం ముహూర్తాలు పెట్టుకోవడమే తరువాయి." అన్నాడు రామారావుతో.

"మీరూ, చెల్లెమ్మగారూ ఒకసారి వచ్చి అమ్మాయిని చూసాక అక్కడే ముహూర్తాలు నిర్ణయించవచ్చు. మా ఆమ్మ చాలా తొందరపెడుతోంది అమ్మాయి పెళ్ళి చేసెయ్యాలని" అన్నాడు రామారావు వెళ్ళిపోయే ముందు రఘుపతితో.

"అట్లాగే"నని తల పంకించాడు రఘుపతి.

**"ఏ మాత్రం అనుభవం లేనివాణ్ణి. మీరు కొద్దిగా చొరవ తీసుకోవాలి, అన్నయ్యగారూ"** అన్నాడు రామారావు పరంధామయ్య చేతులు పట్టుకుని.

అతని మాటలకి చలించిపోయాడు పరంధామయ్య. పిల్లలు లేని పరంధామయ్యకి రవికి తన కూతురు నివ్వాలన్న కోరిక కోరికగానే మిగిలిపోయింది. యీ విధంగా ఆడపెళ్ళి వారి తరఫున ఆధిపత్యం వహించడం అతనికి సంతోష దాయకంగా వుంది.

"మీరేమీ కంగారు పడకండి. అన్నీ నేను చూసుకుంటాను" అన్నాడు నిండుగా.

తృప్తిగా నిట్టూర్చి వెళ్ళిపోయాడు రామారావు.

రామారావు వెళ్ళిపోతూంటే 'నేను కవితని పెళ్ళి చేసుకోలేనండీ' అని బిగ్గరగా

## రవ్వంత ఆశ

ప్రతి రాత్రి ...
అర్ధరాత్రి పన్నెండు గంటలదాకా
ఆత్మహత్య చేసుకుందామని ఆలోచిస్తాను
గోడగడియారం దెబ్బ మీద దెబ్బ కొట్టి
పన్నెండుసార్లు నెత్తి బాదుకొని
అలసిపోయాక నా కనిపిస్తోంది ...
విసుగు విరామం లేని తనను చూసి
'బ్రతుకు' నేర్చుకోవాలని
సెకన్లముల్లు లాగా రవ్వంత ఆశతో
'ముందడుగు' వేయాలని! ...

—ఇమంది రామారావు

అరవాలని పించింది రవికి. కాని చూస్తూండగానే కనుమరుగై పోయాడు రామారావ్.

ఆరాత్రంతా ఆలోచనలతో సతమతమవుతూ గడిపాడు. తన మనసు సుధని కోరుతోంది. పెళ్ళన్నది నూరేళ్ళ పంటంటారు. యిప్పుడు మనసుని మభ్యపెట్టి కవితని చేసుకుంటే జీవితం అంతా సుధని పోగొట్టుకున్నందుకు బాధ పడాల్సి వస్తుందేమో!

నాలుగు రోజుల తర్వాత కవిత దగ్గర నుండి ఉత్తరం వచ్చింది. వణుకుతున్న చేతులతో చింపాడు—

"మాష్టారూ,

**'ఏమిటీ అమ్మాయి చొరవ?' అని ఆశ్చర్యపోతున్నారా? ఏమైనా అనుకోండి** పర్వాలేదు. **ఈ రోజు నా మనసు పగ్గంలేని గుర్రంలా పరుగెడుతోంది. ఆ డీ తె ల్పిన తియ్యటి వార్త నాలో ఎంత ఆనందం నింపిందో చెప్పలేను!**

**మాష్టారూ, ఏమేమో రాయాలను కున్నాను, తీరా కాయితం, కలం తీసుకుని కూర్చుంటే అన్నలేమీ రాయలేకపోతున్నాను. ఇక్కడికి వచ్చిన దగ్గర నుండీ మిమ్మల్ని రోజూ తలచుకుంటున్నాను. మిమ్మల్ని చూడకుండా వుండడం ఎంత దుర్భరమో యిప్పుడు తెలిసి వస్తోంది. 'ఎడబాటంటే ఎదలో ముల్లు' అనే మాట అక్షరాలా నిజం అనిపిస్తోంది, యిక్కడకు వస్తానన్నారు, ప్లీజ్, ఒక్కసారి రండి, రవీ! యిప్పుడిక యీ కవిత మీ కవిత కదా! మీ కవిత మీ రాక కోసం వేయి కళ్ళతో ఎదురు చూస్తోంది, వస్తారు కదూ! లేక బ్రైడ్ గ్రూం నని బెట్టు పోతారా!**

**! వస్తారని ఆశిస్తూ ...**

**మీ కవిత."**

**ఉత్తరం** చదివిన తర్వాత రవి మనసు బాధగా మూలిగింది. యింత అమాయకంగా తన మీద ఆశలు పెంచుకుంటున్న కవితనెలా కాదనగలడు? తను తిరస్కరిస్తే ఆమె బ్రతుకగలదా? ఆమె ఏం తప్పు చేసిందని ఆమె కంత శిక్ష విధించగలడు? కాని కేవలం సానుభూతితో పెళ్ళి చేసుకుని ఆమెనేం సుఖపెట్టగలడు?

పరంధామయ్య కాకినాడ బయలుదేరమని జానకమ్మని రోజూ తొందర చేస్తున్నాడు. 'మామయ్యా, నేను కవితని చేసుకోను' అని చెప్పాలనుకుంటూనే చెప్పలేక పోతున్నాడు. అక్కడ నుండి నిష్క్రమిస్తే సమస్య తాత్కాలికంగా పరిష్కార మౌతుందని ఒకరోజు తల్లితో అన్నాడు—"ఓసారి తిరుపతి వెళ్ళివస్తానమ్మా."

"పెళ్ళి అయ్యాక యిద్దరూ కలిపి వెళ్ళ వచ్చుగా" అన్నాడు పరంధామయ్య.

"ఊహూఁ యిప్పుడోసారి వెళ్తాను" అన్నాడు రవి కాస్త ధైర్యం తెచ్చుకుని.

"పెళ్ళి అయ్యాక ఏ కాశ్మీరో, ఊటీయో వెళ్తారు గాని, తిరుపతి, కన్యాకుమారీ ఈ రోజుల్లో వెళ్ళరోయ్" అన్నాడు రఘుపతి చమత్కారంగా బావమరిదితో.

(ఇంకా వుంది)

# వారఫలం

**16–10–1981 శుక్రవారం మొదలు 22–10–1981 గురువారం వరకు**

మేషం: ధనాదాయమున్నది. వ్యాపారంలో లాభించే మార్గమున్నది. పెద్దల పరిచయం ఏర్పడే మార్గమున్నది. పనులు కావలసిన ధనం చేతికందుతుంది. క్రీడావనిలో కొందరకు ప్రోత్సాహం లభించనున్నది. స్త్రీలకు: సుఖశాంతులకు నూతన విషయాలు తెలిసికొనుటకు అవకాశం గలదు.

వృషభం: మాట చెలామణి అవుతుంది. ధైర్యంతో సర్వకార్యాలు నెరవేర్చుకోగలరు. ఈ వారం వృత్తి, వ్యాపారాలలో ప్రోత్సాహం కనిపిస్తుంది. ధనలాభం, శుభకార్య ప్రస్తావన ఇత్యాదిశుభఫలితాలుంటగలవు. స్త్రీలకు: వస్తుసేకరణ, బంధువులు —సంతానమూలకంగా ఆనందం గల వారం.

మిథునం: సంఘంలో గొప్ప పేరు తెచ్చుకొంటారు. పరుల విషయాలలో జోక్యం కలుగజేసికోవటం, ఇతరులకై శ్రమించటం జరుగుతుంది. వృత్తి, వ్యాపారలలో అనుకూలత కనిపిస్తుంది. స్త్రీలకు: బంధువర్గీయులవలన మేలు, పరోపకారచింతన. ఉద్యోగమందు అనుకూలత చెప్పదగిన వారం.

కర్కాటకం: గ్రహించండి, కళాసాహిత్య రంగాలలో, పత్రికాప్రకటనలో, రచనా వ్యాసంగంలో ఉద్యోగంలో మేలు చేకూరగల వారం. వ్యాపారం మాత్రం యథాప్రకారం సాగిపోతుంది. అధిక లాభాలకు ప్రయత్నించకుండె, అంతాసుముఖమే. స్త్రీలకు: వృత్తిలో ప్రకాశం, కుటుంబానందం, రాజకీయంగా బాగుండటం గమనిస్తారు.

సింహం: వాస్తవంగా మేలు చేకూరగల వారం. నూతన వ్యక్తులను కలిసికొంటారు. నూతన వ్యవహారాలు తెలిసికొంటారు. నూతన మిత్రులు చేరుతారు. కొందరు దూరదేశాలకు ప్రయాణం చేయగలరు. ఉద్యోగంలో అనుకూలత సంభవం. స్త్రీలకు: ఆదాయం గల వ్యవహారాలలో జోక్యం ఉంటుంది. వృత్తిలో ప్రగతి కనిపించే వారం.

కన్య: సుఖశాంతులుంటాయి. గౌరవంలభిస్తుంది. వృత్తి ప్రకాశిస్తుంది. నూతనోద్యోగ ప్రయత్నాలు ఫలవంతం కానున్నవి. బంధువర్గీయులను కలిసికొంటారు. ఆప్తమిత్రుల, అధికారుల వలన జరుగదగిన పనులు నెరవేరుతాయి. స్త్రీలకు: నూతన వస్తు సేకరణ, శుభకార్యాలోచనలు, వృత్తిలో ప్రగతి, వ్యాపారానుకూలత, క్రీడావనిలో అవకాశాలుండ గలవు.

తుల: ఎంతో శ్రమపడితేనేగాని వారం జరుగదనిపిస్తుంది. బంధుస్నేహములకు చాలమందిని గురి కాగలరు. చాలమందికి క్రీడారంగంలో, కళారంగంలో అవకాశాలు చిక్కినట్లే చిక్కి మాయమగును. స్త్రీలకు: వస్తుసేకరణకు అవకాశము గల వారం.

వృశ్చికం: వ్యాపారం సులువుగా సాగుతుంది. క్రయ విక్రయములందు లాభించే మార్గమున్నది. జాయింటు వ్యాపారంలో ఇబ్బందులు ఏర్పడగల వారం. ఉద్యోగంలో, ఎంత శ్రద్ధ వహిస్తే అంతమేలు. స్త్రీలకు: శుభకార్యానుకూలత, రాజకీయంగాను ఏదోమేలు జరుగనున్నదని గ్రహించాలి.

ధనుస్సు: ఆరోగ్యమందు శ్రద్ధ వహించాలి. వయసు మీరిన వారు మరీ శ్రద్ధ తీసికొనవలసిన వారం. స్వల్పంగా మీకు ఆదాయం లేకపోలేదు. ఉద్యోగంలో ఎంతో చాకచక్యముతో మీ మీ కార్యములు సాధించుకొనవలసిన వారం. స్త్రీలకు: నూతనావకాశాలు అన్ని రంగాలలో కనిపించటం, శుభకార్యములకు ప్రయత్నములు జరుగుట గమనింపదగిన అంశాలు.

మకరం: మీరు చేసే ప్రయత్నాలు ఫలించుటకు, భూమియో, గృహమో కొనుగోలుచేయగలరు. క్రయ విక్రయములందు అనుకూలతగల వారం. ఉద్యోగంలో నూతనావకాశాలు చాలమందికి లభించగలవు. అప్రయత్నధనలబ్ధి కొందరివిషయంలో చెప్పదగిన వారం. స్త్రీలకు: వస్తువులో, వస్త్రములో, నగలో, ఇల్లింటినో కొనే అవకాశమున్నది. ఆరోగ్యలోపం లేదు.

కుంభం: కృషిచేయండి. అనుకూలమైన వారం. ఉద్యోగంలో ఏదో మేలు మీకు జరుగనున్నది. ధనాదాయంగల వారం. వ్యాపారంలో చెప్పదగిన మేలు జరుగనున్నది. క్రయ విక్రయములలో లాభించ గల వారం. స్త్రీలకు: సర్వానుకూలత గల వారం. కళా సాహిత్య రంగాలలో నూతనావకాశాలుండ గలవు.

మీనం: రాజకీయ వాదులకు, క్రీడారంగంలో అనుభవము గలవారికి అవకాశాలుండగలవు. ఆదాయమున్నది. అనుకున్న వ్యవహారములు యథావిధంగా నెరవేరగలవు. ఆరోగ్య లోపం లేదు. కృషి చేయండి. అన్ని విధాలామేలున్నది. స్త్రీలకు: సుఖ శాంతులుండుట, శుభకార్యములకు పునాదులేర్పడుట, ఉద్యోగంలో ఉన్నత స్థితికి పోవుటకు అవకాశాలు కనిపించగలవు.

— విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి




జోరున కురిసిన వాన రోడ్ల మీద సన్న సన్నని పిల్ల కాలువలు తీసేక గాని ఉధృతం తగ్గించలేదు. తేటపడిన ఆకాశం అద్దంలా మెరుస్తోంది. వచ్చగా కళ కళ లాడుతోన్న చెట్ల ఆకులు జిలి జిలి చినుకులకు పులకిస్తూ పరవశంతో తలలూగిస్తున్నాయి.

ఆహ్లాదకరమైన ఆ సాయం సంధ్యవేళ ముందు గదిలో కూర్చొని, ఆర్ద్రత చెందిన ప్రకృతి సౌందర్యాన్ని అవలోకిస్తూ, సుమతి ఇచ్చివెళ్లిన వేడి టీ సిప్ చేస్తూ, స్టీరియోపై తన కిష్టమైన ఘంటసాల పాటలు వింటూ మధురానుభూతి ననుభవిస్తోన్న వేణుగోపాల్, గేటు తీసిన చప్పుడు అంతరాయం అనిపించగా కిటికీ గుండా అవతలకు చూసేడు.

ఆకాశంలో హరివిల్లు నేల జారిందా అన్నట్లు గులాబీరంగు చీర,జాకెట్టు ధరించిన వింధ్య చిరునవ్వులో తడుస్తూనే లోపల కొచ్చింది.

ఈసారి ఆమెను చూడక చాలా రోజులే అయిందనిపించింది.

ఆమెను, ఆ ముఖంలో విరిసిన సంతోషాన్ని చూడగానే అతడికి అమితానందం కలిగింది ఎందుకో గాని.

"రండి" హృదయ పూర్వకంగా ఆహ్వానించేడు.

చిరునవ్వుతో లోపలి కొస్తూనే అంది వింధ్య, "అప్పాయింట్ మెంట్ ఆర్డర్స్ వచ్చేయి వేణుగారూ! వారం రోజుల్లో జాయినవమన్నారు."

ఆ సంతోషానికి కారణం తెలిసేక మరింత ఆనందపడ్డాడు. "చాలా సంతోషం వింధ్యా! ఇంత తొందరగా మీకు జాబ్ వస్తుందనుకోలేదు. మీ కృషి ఫలించింది."

"మీరు శ్రద్ధ తీసుకొని ప్రయత్నం చేయకపోతే ఇంత తొందరగా వచ్చేదా? నన్నిలా నిలబెట్టినందుకు మీకు, ఎంతో ధైర్యం చెప్పి నాలో జీవంపోసిన సుమతికి నే నెంతో ఋణపడి వున్నాను నిజంగా."

ఆ కళ్లల్లో ఏ జ్ఞాపకాలు కదిలేయో గాని చెమరించిన చిహ్నాలు ప్రస్ఫుట మయ్యేయి. అవి మనోహర్ తాలుకు మధురస్మృతులేనని తెలిసి మౌనం దాల్చేడు, గుండె ఆర్ద్రత చెందగా.

ఆకాశంలో విహరించే అంతమైన అన్యోన్యతగల పక్షి జంటలో ఒకటి విధి చూపిన చిన్న చూపుకు, వేటకరి సేస్త అనహాయురాలైన ఆడపక్షి రెక్కలు తెగిన దానిలా అయిపోగొట్టుకున్న తోడు కోసం, నీడ కోసం విలపిస్తుంటే మానవత కలిగిన ఏ గుండె చెమరించదు? ఏ కన్నుల్లో నీరు నిండదు? ఎవరు మిన్నకుండ గలరు?

రెండు కుటుంబాల మధ్య నున్న స్నేహ బంధాన్ని పునస్కరించుకొని వింధ్యను ఆదుకొన్నారు తను, సుమతి. ఓదార్చేరు. ధైర్యం చెప్పేరు.

సుమతి గుండె చెరువవగా, "పాతికేళ్ళు నిండకుండానే పసుపు కుంకుమ నేల రాలిన దౌర్భాగ్యపు బ్రతుకు పగవాళ్ళకు కూడా వద్దండీ! ఇంత అన్యోన్యంగా వుండే జంటను చూస్తే భగవంతుడికి కూడా అసూయే కాబోలు! ఆ లారి అతడి ప్రాణాలే తీసుకోవాలా? మూడేళ్ళు నిండని పసివాడు నోరారా సరిగ్గా నాన్నా అని పిలకుండానే, ఆ నాన్న అదృశ్యమై పోవాలా? వింధ్యను చూస్తే గుండె తరుక్కు పోతోందండీ!" అంటూ కన్నీరు కార్చే సుమతిని తను ఓదార్చవలసి వచ్చింది.

ఆడవాని పసుపు కుంకుమల పట సాటి ఆడదాని కెంత ప్రీతి? మోడువారిన స్త్రీ జీవితం, సాటి స్త్రీని ఇంతగా గుండెకోత కోస్తుందని సుమతిని చూసేకే తెలిసింది.

వింధ్య ఆ దుఃఖాన్ని మరిచేందుకు సుమతి చేయని ప్రయత్నం లేదు. కన్నీరు తుడిచి గుండెల్లో పొదువుకొంది "బాబు కోసం మామూలుగా వుండాలి వింధ్యా! వాడు బెంబేలుపడి పోతాడు" అంటూ ధైర్య వచనాలు పలికి జీవం పోసింది.

ఆ జీవమే వింధ్యలో లేలేత చివుళ్ళు వేయించింది.

జీవితం పట్ల ఆశలు కలిగించింది.

టప్పున ఏదో క్రిందపడిన శబ్దం లోపల!

ఉలిక్కిపాటుతో ఈ లోకంలోకి వచ్చిపడ్డారు ఇద్దరూ ఆలోచనల నుండి.

కొంగుతో ముఖం తుడుచుకొంటూ, "ముందు ఈ వార్త సుమతికి చెప్పాలని వచ్చేను." అంటూ గబగబ లోపలికి వెళింది వింధ్య.

"ఏమిటిది సుమతీ! దేనికో తిలోదకాలిచ్చేసినట్టున్నావే?"

# జాలిగుండె లోతుల్లో

"ఓ... వినపడిందా మీకూ!" గాజుపెంకు పగిలిన నవ్వు.

"ఇంకా వంటపనేనా? సాయంత్రం చల్ల గాలికి కొంచెం సేపు తీరుబాటుగా కూర్చొని ప్రకృతి సౌందర్యాలు పరిశీలించకుండా..." నవ్వుతూ అంది వింధ్య.

"నా కెందుకు తల్లీ, ఆ సౌందర్యాలు, పరవశాలు? నీలాంటి చదువుకున్న వాళ్ళకు, ఉద్యోగాలు చేయబోయే వాళ్ళకు గాని!"

వింటోన్న వేణుగోపాల్ తెల్లబోయేడు. హాల్లో వుండిపోవడం వలన వింధ్య ముఖ కవళికలు ఎలా మారేయో చూడలేక పోయేడు గాని, ఆమె సున్నిత హృదయం గాయపడి వుంటుందని మాత్రం నిర్ధారించుకొన్నాడు.

సుమతి కివాళ ఏమైందని? ఇవాళే కాదు ఇటీవల ఆమెలో వస్తున్న మార్పు గమనిస్తూనే వున్నాడు.

వింధ్య పట్ల ఆమె గుండెలనిండా పేరుకు పోయిన సానుభూతి, కరుణ, ప్రేమ కొంచెం కొంచెంగా కరిగిపోవడం గమనిస్తూనే వున్నాడు ఆమె గురించి బాధ పడుతూ కబుర్లు చెప్పడం లేదిప్పుడు పూర్వంలా రాక పోకలూ లేవు.

ఒక్కసారిగా సుమతిలో వచ్చిన మార్పుకు కారణం అతడికి బోధపడలేదు.

ఆ రాత్రి పక్కలు దులిపి వేస్తోన్న సుమతితో అన్నాడు-

"వింధ్యకు ఉద్యోగం వచ్చింది కనుక ఆమె జీవితం ఒక గాడిన పడినట్లే! బాబు ఆమె బ్రతుక్కి అర్థం అయితే, వుద్యోగం పర మార్థం అయింది. ఆమె గుండె నిబ్బరానికి పట్టుదలకు మనం నిజంగా సంతోషించాలి."

"పాపం, చాలా సంతోషంగా వుందను కొంటాను మీకు ?" కంటి కొనల్తో ఓరగా చూస్తూ అంది సుమతి.

ఆశ్చర్యపోతూ అన్నాడు "ఆమెలో వచ్చిన ఈ మార్పు సంతోషదాయకం కాదా సుమతీ? పరీక్షలకు కట్టి పాసయి, ఉద్యోగ ప్రయత్నాలు చేసి, చివరకు తన కాళ్ళమీద తాను నిలబడ గలగడం సామాన్య విషయమా ? అంత గుండె నిబ్బరం, ఆత్మవిశ్వాసం ఎంతమంది ఆడవాళ్ళ కుంటుంది? మనం కోరుకున్నదీ ఆమె దుఃఖాన్ని మరచిపోవాలనే కదా ?"

"పిచ్చి లేకపోతే సరి! మొగుడు పోయి



మహిషాసుర మర్దిని
[చిత్రం : టి. వి. యస్. మూర్తి]

ఏడాది అయిందో లేదో చదువంది, పరీక్ష లంది, ఉద్యోగమంది, ఇక రేపు పెళ్ళం టుంది! ఆ చీరలూ, ఆ షోకులూ చూడ రాదూ! చూసిన వాళ్ళు నోళ్ళు నొక్కు కుంటున్నారు ఎవరైనా దుఃఖాన్ని మరచి పోవాలంటారు గాని, ఇలా బరితెగించ మంటారా ?"

గుండెల్లో పొదువుకొని ఓదార్చి, ఆమె దుస్థితికి కన్నీరు కార్చిన కరుణామయి సుమతేనా ?

"మా మేనత్త కూతురు మీనాక్షిని చూడండి. భర్త పోయి నాలుగేళ్ళ యినా ఈ నాటికీ వీధి గుమ్మం చూసి ఎరుగదు. ఇప్పటికీ అతడిని తలుచుకొని కుమిలి పోని రోజు లేదు. ఆ దిగులుతోనే చిక్కి శల్యం అయ్యింది ఎవరెన్ని చెప్పినా మామూలు మనిషి కాలేకపోతోంది. మొగుణ్ని మరచి పోలేకపోతోంది. అంతేగాని ఈ విపరీతం, ఈ బరితెగింపూ ఎక్కడా చూడ లేదు సుమా!" టక్కున దీపం ఆర్పేస్తూ మంచం మీద వాలిపోయింది సుమతి.

ఆమె జాలిగుండె లోతుల్ని అర్థం చేసుకొన్న వేణుగోపాల్ ఇక మాట్లాడటం మూర్ఖత్వమే అవుతుందను కొన్నాడు!

# నెస్టమ్ శిశువు జీర్ణానికి మంచిది



మీ పాపకు 4 నెలలు వచ్చినప్పటి నుంచి నెస్టమ్ బేబీ సిరియల్ రైస్ ఇవ్వండి. ఇందులో 11 విటమిన్లు, ఇనుము సమృద్ధిగా ఉన్నాయి.

బియ్యం నుంచి తయారయిన సీరియల్ జీర్ణం చేసుకోడానికి సులభమయినది.

నెస్టమ్ ప్రయోజనాలు అనేకం

పాలతో నెస్టమ్ యివ్వడం ప్రారంభించండి. పాప పెరుగుతూ వుంటే, ఆహారంలో నెస్టమ్ ఉడకబెట్టిన పండ్లు, వండిన మరియు మెత్తగా చేసిన కాయగూరలు, పప్పులతో పలురకాలుగా ప్రవేశపెట్టండి.




## నెస్టమ్®
## బేబీ సీరియల్
## రైస్




తయారు చేయడం సులభం



ముందుగ మరిగిన వెచ్చని పాలు పోయండి



నెస్టమ్ చేర్చండి కలపండి



తినిపించుటకు తయారు

SAA/FSL/N/1863 TEL

పెద్దకథ

# ఓ సత్యం కథ

## గరికపాటి కృష్ణమూర్తి

## ప్రారంభం!

"దేవుడో! దేవుడో! నన్నిడిసిపోయావా దేవుడా!!
నా పిల్లల్ని నట్టేట ముంచెల్లావా దేవుడా!!!"

రామి కన్నీరు మున్నీరుగా మొగుడు శవంమీద పడి యేడుస్తోంది

చూస్తూ చుట్టూ చేరిన స్త్రీలందరూ చీదేస్తున్నారు. పైటకొంగులతో కన్నీళ్ల తుడుచుకొంటున్నారు.

గంటైనా భోరుభోరున యేడుస్తూనే వుంది. తలను నిమిరింది. వక్షస్థలంమీద పడిపోయింది కాళ్లను తడిమింది. చేతులను ముద్దాడింది. చెంపకు తన చెంపను ఆనించి కన్నీటిధారలతో భర్త ముఖాన్ని అభిషేకం చేసింది.

గుండె పగిలి చచ్చిపోతుందేమోనని చిన్నమ్మ రామిని తన అక్కున జేర్చుకోబోయింది. ఒక్క విసురు విసిరేసి భర్తమీద పడిపోయింది. ఇంత దుఃఖాన్ని భరించలేనట్లు ఆపాదమస్తకాన్ని ఆలింగనం చేసుకుంటూ విలవిలా కొట్టుకుంటోంది.

మళ్లీ మళ్లీ ఆ శవాన్ని హృదయానికి హత్తుకుంటోంది.

హృదయంలో ఉద్భూతమైన హోరును భర్తకు వినిపిస్తుందా అన్నట్లుంది. ఘోష వినమని చెప్తున్నట్లుంది.

ఆ ముఖంలో, ఆ చేతుల్లో, ఆ కాళ్లల్లో తన ఆనందం, తన బలం, తన శక్తి ఉన్నవి. తన ఆశలు ఆశయాలు భావనలు – కామనలు – అన్నీ వాటిల్లో పెనవేసుకున్నయ్. చివరకి తన జీవితం, తన ప్రాణం, సర్వస్వం ఆయనలో ఉన్నయ్. ఇవన్నీ యెవరికి తెల్సు?

ఇప్పుడవన్నీ లేవంటే యెలా? ఏమైపోవాలి? ఏమిటి దారి?

"దేవుడో!... దేవుడో..."

రామి హృదయాంతరాళాల నుండి పెల్లుబుకి వస్తున్న దుఃఖానికి సత్యం హృదయం ద్రవించిపోయింది. ఆర్ద్రత చెందింది.

రామికి భాష చాలటంలేదు. భర్తృవిహీన శూన్యాన్ని చెప్పలేకపోతున్నది. అదెంత భీతావహమో– యెంత అంధకారబంధురమో ఒకసారి ఆ దుఃఖంలోనే దృష్టిని ముందుకు సారించి "అమ్మో అమ్మో" అని మాత్రం బిగ్గరగా యేడ్వగల్గుతోంది.

"నిన్నిపాటేలప్పుడు ఇటే యెల్తూ పిన్నమ్మా నీ రోగం కుదిరిందాని పలకరించి మరీపోయాడే బిడ్డ! ఇయ్యాలతో నూరేళ్ల నిండినయ్.. అంతా మాయగా ఉందే..."

మాయ! అంతా మాయ
నిన్న వెంకడు నిజం!
నేడు వెంకడు మాయ.
నిన్న రామి కలలు నిజం.
ఇవ్వాళ అబద్ధం

కాని ఇది యదార్థమైన సత్యమేనా? సత్యానికి వెంకడి శవం యదార్థంలా తోచింది వెంకడి భార్య రోదన యదార్థం. పిల్లల క్షోభ యదార్థం.

హెచ్చరిక లేకుండా వటవృక్షాన్ని కూకటి వేళ్లతో పెళ్లగించేసిన ప్రభంజనానికి లేచిగురుటాకు లాంటి వెంకడి పిల్లలు ముందు ముందు మాడిపోవటం యదార్థం.

లేనిదేదో కనుక్కొమనే మాయా దర్పణం ఎక్కడుందో తెలియదు. కళ్ల ముందున్న అద్దం ఆత్మజ్ఞానాన్ని బోధిస్తుంది.

వెంకడి భార్యా బిడ్డలకు ఆర్థిక భద్రతేమిటి? సాంఘిక రక్షణ యెక్కడుంది? రామికి పతి ప్రేమ, పిల్లలకు తండ్రి మమతాను రాగాలు యెక్కడ దొరుకుతాయ్?

"పోలీసులు ... పోలీసులొస్తున్నారు"

వెంకడు అన్నకొడుకు సుగుణరావు వచ్చాడు మున్సబు రిపోర్టుమీద పోలీసులు వస్తారని ఎదురు చూస్తున్నదే!

పోలీసు జీపు ఆగగానే యెవరికి వారు తప్పుకొన్నారు.

అయినవాళ్లు నలుగురైదుగురున్నారు
కానివాడు సత్యం కూడా ఉన్నాడు.

పక్కయింట్లో నుండి సబ్ యిన్‌స్పెక్టరుకు ఒక కుర్చీ తీసుకొచ్చి వేశాడు సుగుణరావు కానిస్టేబుల్స్‌కు మంచాలు వాల్చాడు. కాని వాళ్లెవరూ కూర్చోలేదు. సబ్ యిన్‌స్పెక్టరు వాంగ్మూలం తీసుకొనటం మొదలెట్టాడు ముందుగా సుగుణరావు ముందుకు వచ్చాడు

సుగుణరావు వెంకడికి స్వయాన అన్నకొడుకు. ఇరవైఅయిదేళ్లుండవచ్చు. ఎనిమిదో తరగతివరకూ చదువుకున్నాడు. తండ్రి యిచ్చిన యెకరం కొండ్రము దున్నుకుంటూ, అందరితోబాటు కూలీనాలీ చేసుకుంటూ బ్రతుకుతున్నాడు.

ఈ దారుణం జరిగేటప్పుడు సుగుణరావు తన చేను గట్టున ఉన్నాడు. చేనుకు, ఈ సంఘటన జరిగిన ప్రదేశానికి నాలుగైదు ఫర్లాంగుల దూరముంది. ఏదో మాటా మాటామీద ఘర్షణ పడుతున్నారనుకొన్నాడుగాని చిన్నాన్నను చంపేస్తారని అనుకోలేదు.

తనలాగే పొలంలో వున్న లక్ష్మడు కర్రతో పరుగు పరుగునవచ్చి అక్కడ నాలటం, నిమిషంలో చిన్నాన్నను తల బద్దలుకొట్టి పారిపోవటం చూశాడు ఏదో అవాంతరం జరగబోతుందని పసిగట్టి తనూ పరుగెత్తాడు.

కాని జరగవలసిందేదో అప్పటికే జరిగిపోయింది. చిన్నాన్న రక్తపు మడుగులో ఉన్నాడు. స్పృహ కోల్పోయే స్థితికి వచ్చేశాడు. దాహం కోసం నోరు తెరుస్తున్నాడు.

"ఇదిగో ఈ సత్యంగారే ప్రక్క చిల్లలో నీళ్లను దోసిట్లో పట్టి నోట్లోపోశారు. అదే.. ఆ నీరే మా చిన నాన్నకు తులసి తీర్థమైంది."

చూసింది చూసినట్లు సుగుణరావు చెప్పాడు.

ఆ చెప్పిన దాంట్లో వెంకడిని చంపటానికి లక్ష్మడికిగల పగ, ద్వేషమేమిటో, తగిన కారణాలేమిటో సబ్‌యిన్‌స్పెక్టరు కర్థం కాలేదు

అదే అడిగాడు.

"వాడు పరశురామయ్యపాలేరు. మా చిననాన్న పరశురామయ్యగారి పొలాన్ని మా హరిజనుల యిళ్ల స్థలాల కోసం పెట్టాడు. అది జరుగుతూవుంది ఈ మధ్యన సర్వేయరు కూడా వచ్చి, పొలం కొలిచి రాళ్లు వేసెళ్లాడు. వాటిని తీసెయ్యమని ఒకణ్ణి పంపాడు. మా చిన్నాన్న అది సబబుగాదని చెప్పటానికి వెళ్లి ఉంటాడు."

"పరశురామయ్య పొలానికి పెడితే లక్ష్మడికి మీ చిన్నాన్నమీద పగ పెట్టుకోవాల్సిన పనేముంది?"

సబ్‌యిన్‌స్పెక్టరు అడిగినదానికి సత్యానికి వళ్లు మండింది.

"ఆయన డబ్బున్నవాడు! వీడు డబ్బువాడు."

సబ్‌యిన్‌స్పెక్టరు తలెత్తి సత్యంవంక జూశాడు, నీకేమి సంబంధమన్నట్లు.

నిన్నెవరు అడిగరన్నట్లున్నవి ఆ చూపులు

"వారు సత్యంగారని యీ వూరేనండి. యం బి బి. యస్, చదువుతున్నారు. ఆ పరశురామయ్య తమ్ముడిగారికి కాబోయే అల్లుడుగారు"

"అలాగా" మొఖం కొంచెం తటపడింది

"కూర్చోండి.'

సత్యం మంచంమీద కూర్చున్నాడు.

సబ్‌యిన్‌స్పెక్టరు "ఏ కాలేజండి"

చెప్పాడు.

"ఇయర్."

"ఫోర్త్ యియర్"

సత్యానికి అప్రస్తుతపు సంభాషణ అంత రుచించలేదు.

ముభావాన్ని గ్రహించాడు సబ్‌యిన్‌స్పెక్టరు

విషయాన్ని మారుస్తూ "మీరుకూడా వాంగ్మూలం యిస్తారా ?"

"వై నాట్."

"గుడ్."

సబ్‌యిన్‌స్పెక్టరు చాలా సంతోషపడ్డాడు. చచ్చినవాడి ఖరీదు చాలా తక్కువ. కేసు కూడా పేలపుపిండిలా యెగిరిపోతుందనుకున్నాడు.

పై పెచ్చు పరశురామయ్య కుటుంబానికి బంధువు కాబోతున్నవాడే సాక్ష్యం యివ్వటానికి ముందుకు వస్తున్నాడు. ఇప్పుడు మొదటి ముద్దాయిగా పరశురామయ్యనే పెట్టొచ్చు. కేసు బలమైనవాళ్లమీద బలంగా నిలబడుతుంది. అటు కేసుకు కేసూ బలంగా ఉంటుంది. ఇటు తనకూ...

పాలను చిలికితేనే వెన్న వచ్చేది నీళ్లను చిలికితే యేమొస్తుంది !?

"అయితే మీరు పోలీసు స్టేషనుకు రావాలి శవాన్ని పోస్టు మార్టమ్‌కు పంపిస్తున్నాం."

ఈ లోపల పోలీసులు శవాన్ని వ్యాన్‌లోకి యెక్కించారు.

రామి ఆ శవాన్ని వదలలేకపోతోంది. తనూ వ్యాన్‌లోకి యెక్కింది.

"పరీక్ష చేయించగానే మీకే ఇచ్చేస్తామమ్మా" కానిస్టేబుల్ నచ్చజెప్పుతున్నాడు.

ఇంతలో సుగుణరావు వెళ్లి చిన్నమ్మను బయటకు తీసుకొచ్చాడు.

అదే వ్యానులో సత్యం, సుగుణరావు లిద్దరూ టౌనుకెళ్లారు.

ఈ వార్త ఊళ్లో దావానలంలా వ్యాపించి పోయింది. ఊరంతా అట్టుడుకి నట్లుడికిపోయింది. ప్రతినోట సుగుణరావుతోబాటు సత్యం వాంగ్మూలం యివ్వటానికి టౌనుకెళ్లాడని చెప్పుకుంటున్నారు.

ఈలోగా లక్ష్మయ్య ఊపొదరి పారిపోయాడు. ఈ పరిస్థితితుల్లో వూళ్లో వుండటం అంత శ్రేయస్కరం కాదని పరశురామయ్య కూడా పొలం చూడటానికని వెళ్లి ఆ దారినే ప్రక్క వూళ్లో బస్సెక్కి పోయాడు.

అందరూ అనుకొంటున్నట్లు పోలీసులు వచ్చారు. పరశురామయ్య, లక్ష్మయ్యలకు అరెస్టు వారంట్లు తెచ్చారు. ఇళ్లకెళ్లి హడావిడి చేశారు వాళ్ల బంధువుల పేర్లు—వూర్లు తెలుసుకున్నారు

## 2

ఇదంతా రామనాధానికి అయోమయంగా ఉన్నది సత్యం వాంగ్మూలం యివ్వటానికెళ్లాడనగానే గుండెలో రాయి పడ్డట్లయింది. ఏదో జరగరానిది జరిగిపోయినట్లు ఆయన బాధ పెట్టుకొన్నాడు ఇక శాంతమ్మ దిగులే పెట్టుకుంది. కొడుకుకు ఏ ఆపదా, అవాంతరం రాకూడదని ఇలవేల్పులకు మాటి మాటికి మొక్కు కొంది.

* * *

కుటుంబం చిన్నదైనా రామనాధం నలుగురిలో గౌరవంగా హుందాగా నడుపుకొస్తున్నాడు ఉన్న మూడెకరాల కొంద్రతోనే సంసారాన్ని లాగిస్తూ, పిల్లల భవిష్యత్‌కు మంచి బాటలు వేస్తున్నాడు తన ఆర్థిక పరిస్థితికి మించిన భారమే అయినా కుర్రాడు బాగా చదువుకుంటున్నాడు, వృద్ధిలోకి వస్తాడని చదువు చెప్పిన పంతుళ్లు చెప్తే పట్నం కూడా దగ్గరే గదాని కాలేజీకి పంపించాడు

ఇంటర్మీడియట్‌లో చేరేటప్పుడు సత్యం వయస్సు చిన్నదే. అయినా తన చదువును గూర్చి అప్పుడప్పుడూ తల్లిదండ్రులు చేసే సంభాషణ వింటూ ఉండేవాడు.

చేలో పండిన పంట యెలా ఖరాకండికగా తినటానికే సరిపోతుందో, తన శ్రమంతా ఉన్న కొంద్రతోనే యెలా ఖర్చయిపోతోందో —

అమ్మేమో ఆయనకు సహాయంచేయలేనిస్థితిలో ఉంటున్నందుకు అప్పుడప్పుడూ విచారించటం — ఉన్నదాంట్లోనే అన్నీ పొదుపుగా, ఒబ్బిడిగా చేసుకొని రావటం — యివన్నీ వింటుండేవాడు చూస్తుండేవాడు.

ఆయనకంటే ముందే లేచి చదువుకొంటున్న తనను చూసి తండ్రి మురిసిపోవటం తనకు తెల్సు ఆ కళ్లల్లో కాంతుల్ని అనేకసార్లు చూశాడు అప్పుడాయన కాళ్లల్లో ఏనుగంత బలమొచ్చేది.









# ఓ సత్యం కథ

"సత్యం! సదువుకొంటున్నావా బాబు! సదువుకో సదువుకో... సదువుకో..."

'స' కి 'చ' కి భేదం తెలీని తండ్రి ఆ భేదా లేమిటో నేర్పే విచక్షణా జ్ఞానాన్ని ప్రసాదిస్తున్నాడు.

ముల్లుకర్ర చేతపట్టుకొని, కిర్రుచెప్పులేసుకుని చకచకా పొలం వైపుకు నడిచివెళ్లే తండ్రి వైపు అనేకసార్లు అలా చూస్తూ వుండిపోయేవాడు.

ఆ పొలం పండించాలి. ఈ యేడు ఇరవై బస్తాలు. వచ్చే యేడు ఇరవై ఐదు. ఆ పై యేడు ముప్పై. ఇంకా పండించాలి. ఇంకా యెక్కువ కష్టపడాలి. అదీ ఆయన ధ్యేయం.

దేనికి !?

వయసు పెరుగుతున్నా – శక్తి తగ్గిపోతున్నా పెరుగుతున్న బాధ్యతలను సంతృప్తిగా నెరవేర్చ టానికి కష్టపడాలి. శక్తిని పెంచుకోవాలి.

శక్తి తింటేనే రాదు. నాన్నకాశక్తి తిండి వలన రాదు.

తనవలన–చెల్లి పద్మవలన.

అంత బలంగా అడుగులు వేసుకుంటూ పోయే నాన్న కాసేపు ఆ గడ్డా ఈ గడ్డా పనిచేసి, చెమట తుడుచుకుంటూ అలసిపోయి, చేలో గంగరావి చెట్టు క్రింద ఒక పెద్ద గడ్డను తల దిండుగా మార్చుకొని నిద్రపోతూ ఉండటం తను అనేకసార్లు చూశాడు.

ఆ చెమటబిందువులన్నీ తమకు రక్తబిందువులు కావాలని, ఆయన ప్రతి అవయవాన్ని వంచి పని చేసిన ఆ క్షేత్రం సుక్షేత్రమై–తమ భావిజీవిత క్షేత్రాలను సశ్యశ్యామలం చేయాలని ఆయన తాపత్రయం.

అమ్మ పాలెందుకు అమ్ముతుందో...వేడినీళ్లకు చన్నీళ్ళ తోడంటూ పది కోళ్లను యెందుకు మేపుతుందో అర్థం కాకపోలేదు.

తాను చిరిగిపోయిన చీరలను కట్టుకుంటూ తన బట్టలను ఇస్త్రీకెందు కేస్తుందో కూడా తెలుసు.

అమ్మమ్మ యిచ్చిన రెండు బంగారు గాజుల్ని చెడగొట్టి పద్మకి చెయిన్ చేయించిన విషయమూ తెల్సు

వారికి కావల్సిందేమిటి ?

తమ కళ్లల్లో కాంతులు ... వెలిగే దీపాలు.

వారిద్దరూ పోలికులు.

వారి జీవిత వనంలో తాము పారిజాతాలు.

చక్కగా విరిబూయటమే వారికి హృదయా నందం.

కృతజ్ఞత తాము తీర్చుకునే ఋణం.

వారికి సంతోషం కల్గించే పనులు చేయటమే తమ పని.

వారు గర్వపడేటట్లు చదవటమే తన కర్తవ్యం అలా సాగిపోయేవానాడు సత్యం ఆలోచనలు.

సుందరమైన సుదూరభావిని గూర్చిన కలలు కంటే నలుగురు తనను గూర్చి పొగుడుతున్నప్పుడు వారు పొందే సంతోషం, ఆనందాల కోసమేనన్నట్లు సత్యం పట్టుదలతో చదివేవాడు. క్లాసులో శ్రద్ధగా వినేవాడు. చురుకుదనానికితోడు పరిశ్రమ తోడైంది.

ఫలితంగా యింటర్ ఫస్టు క్లాసులో ప్యాసయ్యాడు.

ఆ వూరిలో ఫస్టుక్లాసు తెచ్చుకొన్నవారిలో సత్యమొక్కడే.

ఆనాడు రామనాథం, శాంతమ్మల ఆనందానికి అవధులే లేవు.

నలుగురూ కొడుకుని గురించి చేసిన పొగడ్తలను భర్త చెప్తుంటే ఆనంద బాష్పాలు రాల్చు కుంటూ అలా వింటూ ఉండిపోయింది. ఎవరు పెట్టాలన్న ధ్యాసే లేదు.

పిల్లాడికి దిష్టి తగులుతుందని సత్యం యింటికి రాగానే యెండుమిరపకాయలు, ఉప్పు ధూపంతో దిగదుడుపు తీసింది.

ఆ రోజు ప్రత్యేకంగా మిఠాయి చేసింది. పక్కింటివాళ్లకు కూడా పంచిపెడుతూ "వదినా! మా సత్యం ఫస్టు క్లాసులో ప్యాసయ్యాడంట. అందుకని" సంతోషాన్ని కూడా నలుగురికీ పంచి పెట్టింది.

ఆ సాయంత్రం రామనాథం ప్రొద్దుటున్నంత సంతోషంగా లేదు.

సత్యం చదువైపోగానే ఉద్యోగానికెళ్తాడు. తనకేదో యింత అండదండగా ఉంటాడని భావించాడు. ముందుగా పద్మని ఒక యింటిదానిని చేసి తర్వాత వాడి పెళ్లి కూడా చేసేస్తే తన బరువు బాధ్యతలు తీరిపోతయ్యనుకున్నాడు ఇదే అభిప్రాయాన్ని నలుగురుముందూ వెల్లడించేవాడు.

కాని యీ రోజు —

"బంగారంలాంటి కుర్రాణ్ణి యెందుకు నాశనం చేస్తావ్ రామనాథం. ఫస్టుక్లాసు రావటమంటే మాటలుగాదు. ఎంతో తెలివిగలవాడైతేనేగాని రాదు వాడు అదృష్టవంతుడు. మధ్యలో చదువు మాత్రం ఆపటోకు. మన కష్టాలు యెప్పుడూ ఉండేవే. ఇంకా నాలుగైదేళ్లు కష్టపడ్డావంటే వాడు పెద్ద డాక్టరో, ఆఫీసరో అయి నీ కష్టాలు తీర్చకపోడు పిల్లాడు కూడా బుద్ధిమంతుడు."

రచ్చబండ దగ్గర నలుగురూ అన్నమాటల సారాంశమిది.

తనుకొంటున్నట్లు ఉద్యోగాలు కూడా అంత తేలికగా దొరకవట. ఈ లోపల ఏం చెయ్యాలి ?

కొడుకు మెరికలాంటి వాడైనా పైకి తీసుకు రాలేని తన ఆర్థిక దుస్థితికి వాపోయాడు.

మొట్ట మొదటిసారిగా దారిద్ర్యం మీద అసహ్యమేసింది.

"రామనాథం ... రామనాథం."

ఎలిమెంటరీ స్కూలు టీచర్ జోగినాథం యింటికిపోతూ అటు వచ్చాడు.

పంతులుగారికి కుర్చీవేశాడు శాంతమ్మ అక్కడే ఉంది.

"ఏడి సత్యం. ఫస్టుక్లాసులో ప్యాసయ్యాడట చురుకైన వాడమ్మా! కాలేజీలో ఇతనిది ఒక్కటే నట ఫస్టుక్లాసు. వృద్ధిలోకి వస్తాడు."

చిన్నప్పుడు ఆ అలు దిద్దించిన పంతులుగారు చెప్పుకుపోతున్నారు.

"చదివించాలేగాని మెడిసిన్ సీటు కళ్ల కద్దుకొని వస్తుంది. అందరిలాగ పదివేలు–ఇరవై వేలు డొనేషను కట్టాల్సిన పని ఉండదు. ఐదేళ్లు కళ్లు మూసుకుంటే డాక్టరైపోతాడు. నా వంటి వాళ్లకు కూడా ఈ ముసలితనంలో ఓ శిష్యుడు డాక్టరుగా ఉన్నాడని ధైర్యం ఉంటుంది."

శాంతమ్మకు స్టెతస్కోపు మెడలో వేసుకొని అటూ యిటూ తిరుగుతున్న సత్యం కనిపించాడు.

రామనాథానికి ఆశ్చర్యమే కల్గింది. డాక్టరీ కోర్సంటే ఉన్నవాళ్ల కోర్సే అనుకొన్నాడు. అంత పెద్ద చదువులు, గొప్ప చదువులు ధనవంతులకే సాధ్యమనుకొనేవాడు.

అంటే తన సత్యం కూడా ఆ చదువులు చదవగలడన్నమాట. అందులో పెద్దడాక్టరీకోర్సు!..

తను డాక్టరుగారి తండ్రి. శాంత డాక్టరుగారి తల్లి. పద్మ డాక్టరుగారి చెల్లెలు. పెద్దబంగాళా– హాస్పటల్లో నర్సులు, కాంపౌండర్లు.. నౌగులు.

# శుభ్రమైన తాజా శ్వాస... ఆరోగ్యం చిందే గట్టి పళ్ళు

# కోల్గేట్
## డెంటల్ క్రీమ్ ఫలితం

ప్రతిసారి భోజనం చేసిన తర్వాత కోల్గేట్‌తో మీ పళ్ళను తోముకోండి. కోల్గేట్ ప్రపంచమంతటా దంతవైద్యులు సిఫారసు చేసే తీరులో మీకు రక్షణ సమకూరుస్తుంది.

మీ పళ్ళలో మిగిలిపోయే ఆహారపు అణువులలో బాక్టీరియా పెరుగుతుంది. అవి ముందు నోటి దుర్వాసన ఆపైన బాధాకరమైన దంతక్షయాన్ని కలిగిస్తాయి.

అందుకే మరి ఎప్పుడూ భోజనంకాగానే కోల్గేట్‌తో తోముకోవడం సరైన మార్గం. అది మీ శ్వాసను తాజాగా రూపొందించేందుకు, పళ్ళను తెల్లగా మెరిసేలా చేసేందుకు దంతక్షయాన్ని ఎదిరించేందుకు అమోఘమైనదని రుజువయింది.

కోల్గేట్ యొక్క నమ్మకమైన సూత్రీకరణ ఎలా పని చేస్తుందంటే:



మీ పళ్ళలో ఇరుక్కుపోయిన ఆహారపు అణువులలో దుర్వాసన, దంతక్షయాన్ని కలిగించే బాక్టీరియా పెరుగుతుంది.



కోల్గేట్ యొక్క సాటిలేని చర్యగల నురుగు బాగా లోతుకుచేరి హానికరమైన ఆహారపు అణువులను, బాక్టీరియాను తొలగిస్తుంది.



ఫలితం: ఆకర్షణీయమైన తెల్లని పళ్ళు, శ్వాస తాజాగా ఉందన్న నమ్మకం, దంతక్షయంనుండి రక్షణ.

**కోల్గేట్‌లోని తాజా పిప్పరమెంట్ లాంటి రుచి మీ మనసుకు నచ్చుతుంది.**

***నోటి దుర్వాసనను ఆపండి... కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో దంతక్షయాన్ని ఎదుర్కోండి!***




DC.G.74 TL

# మరోసారి మనసును గూర్చి

**డా॥ సి. నారాయణరెడ్డి**

కొలనులోని బురదలోంచి
కుసుమం పుడుతుంది.
మనసులోని రొంపిలోంచి
మరింత కంపు పుడుతుంది.

గాలి మోసుకొస్తుంది
కలగూరగంప వాసనలను.
ఏ వాసనా అంటదు దానికి.
చెదలంటుతుందా నిప్పుమేనికి.

ఒంటికి పట్టిన దయ్యాన్ని
ఊదేస్తారట మంత్రజ్ఞులు.
మనసుకు పట్టిన దయ్యాన్ని
మళ్లించలేరు దైవజ్ఞులు.

చిన్నా పెద్దా... ఒకరి తర్వాత ఒకరిని పరీక్షిస్తున్న సత్యం.

"రామనాథం" జోగినాథం పిలిచాడు.

తియ్యటి కల చెదిరిపోయింది.

"సత్యం వచ్చిన తర్వాత నాకోసారి కన్పించమని చెప్పు."

"అలాగేనండి."

బయటవరకూ సాగనంపి వచ్చాడు.

"ఏమండీ! అబ్బాయిని డాక్టరీ చదివిద్దామా?" ఊబలాటం పట్టలేక అడిగింది శాంతమ్మ.

"వాడు మన కడుపున పుట్టాల్సింది కాదు శాంతా!"

## ఓ సత్యం కథ

"ఏమిటండీ అలా అంటారు."

"వాడిని చూసి మనం గర్వపడాల్సిందే తప్ప, మనను చూసి వాడేమీ గర్వపడాల్సింది లేదు."

"వాడేమీ అటువంటివాడు గాదు. మీరూరికే యిదైపోతున్నారుగాని, వాడంతా బంగారమే."

"మనం తెలివితేటలు గల బిడ్డను కనగల్గాం కాని ఆస్తిపాస్తుల్ని సంపాయించలేకపొయ్యాం."

"అలా తిట్టుకుంటూ కూర్చుంటే అమాంతం యేదైనా వచ్చి ఒరిగిపోతుందేమిటి?"

నిజమే. భార్య కష్టాలొచ్చినపుడు కుంగిపోవటం కాని, సుఖాలొచ్చినపుడు మితిమీరి గర్వపడటంగాని చేయదు. ముందున్న సమస్యని అందుబాటులోనున్న పరిస్థితులతో యెలా పరిష్కరించాలా? సాధించాలా? అని చూస్తుంది.

కాని యిది శక్తికి మించిన పనని తెలియదు. డాక్టరీ చదివించాలంటే మాటలు కాదని ఊళ్లో సుందరరామయ్య అంటూ ఉంటాడు. వాళ్లబ్బాయి విశాఖపట్టణంలో చదువుతున్నాడు. సుందరరామయ్యంత రైతే నానా బాధలు పడుతుంటే తనటువంటి వాడికెలా సాధ్యం? పైగా పద్మ పెళ్లీడుకొచ్చి కూర్చుంది. దానికి పెళ్లి చేసి పంపాలి. ఉన్న కొంద్రలో దానికీ కొంత యివ్వాలి.

మంచంమీద వెల్లకిలా పడుకొని ఆకాశంవంక జూస్తూ ఆలోచనల్లో పడిపోయిన భర్తను 'ఈయనెప్పుడూ యింతే. చిన్నదానికి పెద్దదానికి హైరానా పడిపోతార'నుకుంటూ యింట్లో పని చూసుకోవటాని కెళ్లిపోయింది. కొంచెంసేపటికి "భోజనానికి లేస్తారా!" లోపలనుండి భార్య కేకేస్తోంది. "సత్యం పట్నానికెళ్తానని చెప్పాడు. ఆలస్యంగా వస్తానన్నాడు. మీరు కానీయండి."

ఇంతలో "రామనాథం; రామనాథం" రోడ్డుమీద నుండి కేక విన్పించింది.

"ఎవరూ?" రామనాథం లేచాడు. చీకటిలో మనిషి ఆనటంలేదు.

"నేనే రామనాథం ... రాజయ్యను."

"రాజయ్యగారా! ... మీరే ... రండి రండి...

# ఇదిగో!

## క్రొత్త ప్రెస్టీజ్




గేస్కెట్ రిలీజ్ సిస్టమ్

Patent pending

**100% భద్రత**

## అద్వితీయమైన గేస్కెట్ రిలీజ్ సిస్టమ్ కలిగిన క్రొత్త ప్రెస్టీజ్ మీరుకోన బోయే అతి భద్రమైన ప్రెషర్ కుక్కర్

ఆహార పదార్థములచే వెయిట్ వాల్వ్ మూయబడినచో మీ ప్రెషర్ కుక్కర్‌లో హెచ్చు ఒత్తిడి కలుగును అట్టి సమయమున మీ కుక్కర్ భద్రత సేఫ్టీ ప్లగ్ మీదనే ఆధారపడియుండును మీ ప్లగ్ నఖిలీదై వుండవచ్చు మీకు తెలియదు ఎందువలనగా మీరు అసలు సేఫ్టీ ప్లగ్‌ను నఖిలీ ప్లగ్‌ను గుర్తించలేరు

అందువలనే, పూర్తి భద్రత మనసులో ఉంచుకొని ఏమాత్రము ప్రమాదము జరగడానికి వీలులేకుండా, ఈ "క్రొత్త ప్రెస్టీజ్" రూపొందించాము దీని అద్వితీయ గేస్కెట్ రిలీజ్ సిస్టమ్ మీ కుక్కర్ భద్రతను ఎల్లకాలము కాపాడుతు సేఫ్టీ ప్లగ్ అవసరము లేకుండా చేస్తుంది



### అద్వితీయమైన గేస్కెట్ రిలీజ్ సిస్టమ్ ద్వారా క్రొత్త ప్రెస్టీజ్‌కు నూటికి నూరు పాళ్ళు భద్రత ఎలా సమకూరుతుంది?

సెఫ్టి ప్లగ్‌ను త్రోసి వేసేంతగా ఒత్తిడి పెరుగకముందే అధిక ఆవిరి గేస్కెట్ రిలీజ్ సిస్టమ్ ద్వారా ఖచ్చితముగా బయటకు పోవును. నఖిలీ లేక పాత "స్పేర్స్" వాడినను, మీ ప్రెషర్ కుక్కర్ పూర్తి భద్రతనిచ్చును ఎల్లవేళలందు



### క్రొత్త ప్రెస్టీజ్ మీకు ఎక్కువ సౌకర్యము నిచ్చును

గేస్కెట్ ఆవిరిని వొదిలిపెట్టగానే మీరు చేయవలసింది దాని స్థానము లోనికి దానిని తొయ్యడము మాత్రమే అప్పుడు మీ కుక్కర్ తిరిగి వాడకానికి కొన్ని క్షణములలో సిద్దము సేఫ్టీ ప్లగ్గే అనవసరము అందుచే దానిని మార్చే అవసరములేదు దాని గురించి చింతించనవసరము లేదు



### క్రొత్త ప్రెస్టీజ్ ఎంతో మన్నిక కలది

ఆవిరి ఒత్తిడి ఏ సమయమునైనను అపాయకరమైన స్థితికి చేరదు కనుక, కుక్కర్‌కు అరుగుదల చాల తక్కువ అందుచేతనే మిగతా మామూలు కుక్కర్లకన్న క్రొత్త ప్రెస్టీజ్ చాలకాలము మన్నును



### క్రొత్త ప్రెస్టీజ్ వల్ల ఎన్నో అధిక లాభములు

* ఎక్కువ మన్నికైన దళసరి అడుగు
* మన్నికైన స్టెయిన్‌లెస్ స్టీలు స్క్రూలతో బిగించిన దృఢమైన పిడులు
* ఎప్పుడు వేడెక్కని, పట్టునిచ్చు క్రొత్త "ఆక్సిలరీ" పిడి
* పరుత్వము, దృఢత్వము కలిగిన క్రొత్త "ట్రివెట్"
* అద్దములాంటి అందమైన తళతళ
* ఉత్సాహము కలిగించు క్రొత్త వంటల పుస్తకము
* అనుకూలమైన ఆరు సైజులు

**మరియు ఏ లాభములవలన భారతదేశములో 30 సంవత్సరములకు పైగా ప్రెస్టీజ్ కుక్కర్ అందరికి కావలసిన కుక్కర్ అయినదో ఆ లాభములన్నీ ఇందులో వున్నాయి.**

**ttk తయారి.**

**Prestige**



భారతదేశములో ప్రెషర్ కుక్కర్లను ప్రవేశపెట్టినవారు







ఏమేయ్ ఆ కుర్చీ ఇలా తీసుకురా'' భార్యను కేకేస్తూనే తనే వెళ్లి తీసుకొచ్చి వేశాడాయనకు.

రాజయ్య వూళ్లో మోతుబరి. సుక్షేత్రమైన మాగాణి ఇరవై యెకరాల వరకూ ఉన్నది సిరిసంపదలకు తోడు ఊళ్లో పెద్దరిక మున్నది.

గ్రామ సర్పంచ్ పరశురామయ్య, ఆయనా స్వయాన అన్నదమ్ముల బిడ్డలు.

తమ వంటి సామాన్యుల యింటికి పెద్దవారు వూరికే రారు. వస్తే అదొక గౌరవం

ఏదో దూరపు బంధుత్వమున్నా తమ మధ్య నున్న అంతస్తులు—అంతరాలు పెరిగి రాకపోకలు తగ్గిపోయినయ్.

రాజయ్య కుర్చీలో కూర్చున్నాడు.

''ఏదో బావగారు దారితప్పి వచ్చినట్లున్నారు'' రామనాథం అడిగాడు.

''ఇది రామనాథం యిల్లుగాదా ?''

''అదేంటి అలా అడుగుతారు.''

''రామనాథం యిల్లేనా అని.''

''అవును.''

''అయితే దారితప్పి రాలేదన్నమాటే'' తన చమత్కార సంభాషణకి, హాస్య ప్రియత్వానికి తనే బిగ్గరగా నవ్వుకున్నాడు.

రామనాథం శ్రుతి కల్పాడు.

''అమ్మాయి ఉందా ?''

''ఇక్కడే ఉన్నాను అన్నయ్యగారూ!'' గుమ్మంలో నించొనున్నది శాంతమ్మ.

''సరిగ్గా అనటం లేదమ్మా! పెద్దవాళ్లమై పోతున్నాం గదా! కాస్త దగ్గరికొచ్చి కూర్చో. ఒక ముఖ్యమైన విషయం మాట్లాడాలి.''

ముందుకు వచ్చి గుమ్మం అరుగుమీద చతికిల బడింది.

రాజయ్యగారి కెదురుగా భర్త మంచంమీద కూర్చున్నాడు

వెన్నెల పిండారబోసినట్లుంది.

''సత్యం ఉన్నాడా ?'' రాజయ్య ప్రశ్న.

''స్నేహితులతో కలిసి సినిమాకి వెళ్లాడు ''

''అదో సంతోషం. కష్టపడ్డవాడికి ఆ మాత్రం ఆనందం అనుభవించటానికి హక్కుం టుందిలే.''

# ఓ సత్యం కథ

సత్యం ప్రయోజకత్వాన్ని గూర్చి రాజయ్యగారి కున్న సదభిప్రాయం పట్ల వారికి సంతోషమైంది

''ఏం చేయిద్దామనుకుంటున్నారు ?''

''అదే అన్నయ్యగారు ఏమీ తోయటంలేదు కష్టపడే ఓపిక, తెలివితేటలు వాడికున్నాయని మీ వంటి వారందరూ అంటున్నారు. కాని ఏం లాభం? వీణ మంచిదే కావొచ్చు, వాయించేవాళ్లు ఉండొద్దూ.''

శాంతమ్మ లౌకికానికి రాజయ్య మురిసి పోయాడు.

''చల్లకొచ్చి ముంత దాయటమెందుకమ్మా! ఇవ్వాళ ఏకాదశి. మంచిరోజు. మాట్లాడటానికి వద్దామని నిశ్చయించుకున్నానో లేదో — ఆ ఫలితాలు కూడా ఈరోజే వచ్చినయ్. శుభం అనుకొని బయలుదేరాను.''

''ఏమిటన్నయ్యగారూ '' శాంతమ్మ ఆత్రుత పట్టలేకపోయింది.

''సత్యానికి మా కళ్యాణినిద్దామనుకొంటున్నా మమ్మా.''

రామనాథం దంపతులు సంభ్రమాశ్చర్యాల్లో మునిగిపోయారు.

ఒకరి వంక ఒకరు చూసుకొన్నారుగాని ఆ క్రీనీడలో మొఖాల్లో భావాలు చదువుకొనటానికి వీలుపడలేదు.

మళ్లీ శాంతమ్మే అందుకొన్నది ''సత్యాని కప్పుడే పెళ్లేమిటన్నయ్యగారూ! పదిహేడెళ్లి పద్దెనిమిది వచ్చినయ్ పోయిన పండక్కి.''

''భలేదానివమ్మా! పిల్లనిస్తామంటున్నావ్‌గాని యిప్పుడే పెళ్లి చేయమనటంలేదుగా.''

''అదిగాదన్నయ్యగారూ! వాడే నాటి కైనా సుఖంగా స్థిరపడటమే మాకూ కావల్సింది. మీరను కున్నట్లే మనం నిశ్చయాలు చేసుకున్నా కనీసం మూడు నాలుగేళ్ళన్నా పెళ్లి కాగాలి ఈ లోపల యేం చేయటమన్నదే యీయనకు పట్టుకున్న ప్రశ్న.''

రామనాథం ఒక శ్రోతలాగా అటు యిటూ చెప్తోంది వింటూ ఉన్నాడు.

''నేనిక్కడకు వచ్చింది మీ ప్రశ్నలకు సమాధాన మిద్దామనేకదమ్మా. సత్యాన్ని యం. బి. బి. యస్‌కు పంపుదాం. సీటు తప్పక తెప్పించుకోగలడని జోగినాథం మాష్టారు చెప్పతున్నాడు. అయ్యే ఖర్చు నేను పెట్టుకుంటాను. డాక్టరైన తర్వాతనే అల్లుణ్ణి చేసుకుంటాను. కాకపోయినా కళ్యాణి వయస్సు మాత్రమెంత ? పద్నాలుగేగా.''

రాజయ్యగారి ఆలోచనకు యెదురు చెప్పాల్సిన అవసరం కన్పించలేదు. కలిసివచ్చే అదృష్టాన్ని యెవరు కాదంటారు!

అయినా దంపతులిద్దరూ యేకాంతంగా మాట్లాడుకొని ''ఊఁ'' అనుకుంటే అదో సంతృప్తి. ఇదీ శాంతమ్మ ఆలోచన. •

కాని రామనాథం సంతోషం పట్టలేకపోయాడు

''బావగారూ! ఈ రోజునుండి సత్యాన్ని మీ చేతుల్లో పెడుతున్నాం. మంచికైనా, చెడుకైనా వాడి బాధ్యతంతా మీదే. వాడిక యీ రోజునుండి మీ బిడ్డే.''

శాంతమ్మ భర్త నిర్ణయానికి కొంచెం తికమక పడ్డది. కోపమొచ్చింది.

కాని నిర్ణయమైపోయిన తర్వాత తనుకూడా వత్తాసుపలకటం మినహా చేసేదేమీ కన్పించలేదు.

కొంచెం ఆలోచిస్తే నిర్ద్వంద్వంగా భర్త చెప్పిందే సబబనిపించింది ఇటువంటివాటిల్లో వాన్నకూడదు.

ముద్దు వచ్చినపుడే చంక్కెక్కాలి

ఎన్ని విధాల ఆలోచించినా యిదొక కలిసివచ్చిన అదృష్టంగానే తోస్తోంది

* * *

ఇది నాలుగేళ్ల క్రిందటి మాట

సత్యం రాజయ్యగారి కాబోయే అల్లుడిగా ఊళ్లో చెలామణి అవుతున్నాడు

వియ్యంకుళ్లు — వీపరాళ్ల రాకపోకలు, పరామర్శలు గౌరవాభిమానాలతో, మమతాను బంధాలతో ముడివేసుకుంటున్నవి.

ఈ బంధుత్వం ఉభయ తారకమైందని కూడా ఊళ్లోవారు తలపోస్తున్నారు

ఆ మూడు ముళ్లు వేయకపోయినా, వేయించు కోపోయినా సత్యం—కళ్యాణి తమ మనసుల్లో భార్య భర్తలుగానే భావించుకొంటున్నారు.

(ఇంకా వుంది)

# మన పురాణాలలో 'దేవి అవతరణ' గాథలు



"మహిషాసుర మర్దిని"

— ఫొటో : సుధాకర్ యడవల్లి

సకల సృష్టి స్థితి లయకారక మూలశక్తియే 'దేవి'. వేదకాలంనుండీ శక్తి ఉపాసన ఆచరణలో ఉందనటానికి ఎన్నో ఆధారములు కనిపిస్తాయి. 'ఋగ్వేదం' దృష్ట్యా అఖిల బ్రహ్మాండాన్ని నడిపించే మహా మహిమోపేతశక్తి 'దేవీ శక్తి'. 'ఉపనిషత్తు'ల దృష్ట్యా 'మహా శక్తి'కి సంకేతరూపం 'దేవి'. 'శృతు'లలో దేవీశక్తి - 'బ్రహ్మశక్తి'గా వర్ణింపబడింది. ఈ దేవియే "కాత్యాయని, దుర్గ, గాయత్రి, సావిత్రి, భ్రామరి, విశాలాక్షి, వింధ్యవాసిని" మొదలైన పేర్లతో ఆరాధింపబడుతూంది.

దేవి విశేషారాధనా సమయంగా "విజయ దశమి" దేవీ ఆరాధనా దినాలు 'నవరాత్రులు'గా ప్రఖ్యాతికెక్కాయి. దేవి అవతరణా ప్రాశస్త్యానికి సంబంధించిన అనేక పురాణ గాథలను, వాటి పూర్వాపరాలను పరిశీలిస్తే దేవి అవతరణా వశ్యకత, ఇత్యాది వివరాలు సుబోధకం అవుతాయి.

## వరాహ పురాణగాథ

పూర్వం 'సింధు ద్వీపు'డను ప్రాగ్జ్యోతిష పురప్రభువు, తనని పూర్వజన్మలో సముద్రపు నురగతో కొట్టి చంపిన దేవేంద్రునిపై పగ తీర్చుకొన నిశ్చయించి, ఆ ఇంద్రుని హతమార్చ గల కుమారుని పొందేనిమిత్తం వేత్రవతీ నదీ తీరమున తపస్సు ప్రారంభించాడు. వేత్రవతీ నది ఆ సింధుద్వీపుని మోహించి, మానవాకృతి దాల్చి సింధుద్వీపుని చేరగా, వారిరువురి ప్రణయ ఫలితముగా 'వేత్రాసురుడు' అను కుమారుడు జన్మించాడు. ఆతడు అమేయ బలసంపన్నుడై త్రిలోకాలను చీకాకుపరచగా బ్రహ్మ దేవుడు దేవతల అభ్యర్థన నాలకించి ధవళాంబర, సింహ వాహిని, అష్టభుజయగు నొక శక్తి స్వరూపిణిని సృష్టించెనని, ఆ శక్తియే వేత్రాసురాది అసుర గణాన్ని అంతమొందించి బ్రహ్మ ఆదేశానుసారం హిమాలయములలో నివసించెనని, ఆపన్న విముక్తు లయిన జనాళి అప్పటినుండి ఆశ్వయుజ శుద్ధ నవమి, దశమీ తిథులందు దేవీపూజ చేయదొడగి రని వరాహ పురాణగాథ!

## స్కంద పురాణగాథ

పూర్వము 'రురుదానవుని' పుత్రుడగు 'దుర్గుడు' దేవగణాలను హింసించుచుండగా, దేవతలందరి సమైక్య శక్తిస్వరూపంగా 'దేవి' రూపొందెనట. శిరస్సు 'శివశక్తి' నుండి, భుజములు 'విష్ణుశక్తి' నుండి, చరణములు 'బ్రహ్మశక్తి' నుండి, నడుము 'ఇంద్రశక్తి' నుంచి, కేశములు యముని శక్తినుండి, చంద్ర శక్తి నుండి 'ఉరోజములు', కుబేరశక్తి నుండి 'నాసిక', వరుణశక్తి నుండి 'తొడలు', పృధ్వి నుండి 'పిరుదులు' ఆవిర్భవించాయట. ఇలా రూపొందిన స్త్రీశక్తి 'దుర్గుని'తో పోరాడి సంహరించి 'దుర్గ'గా రూపొందినదని, ఆ శక్తియే తరువాత మహిషాసురుని కూడ సంహరించిందని స్కందపురాణంలో చెప్పబడింది.

## కాళికా పురాణగాథ

దక్షయజ్ఞంలో పరాభవించబడిన సతీదేవి దేహ త్యాగం చేసిన తర్వాత శివుడు ఆమె మృత శరీరాన్ని భుజంపై మోసుకొని సంచారం చేయడం ప్రారంభించడంతో విశ్వమంతా అల్లకల్లోలమయింది. విష్ణువు ఇది చూచి తన చక్రాయుధంతో ఆ శవాన్ని యాభై రెండు భాగాలుగా ఖండించాడు. ఆ భాగాలు అనేకచోట్ల పడిపోయాయి. అలా అవి పడిపోయిన ప్రదేశాలలో శక్తిపీఠాలు వెలశాయి. సతీదేవి కుడిపాదం యొక్క నాలుగువ్రేళ్ళు పడిన ప్రదేశమే కాళీ ఘట్టమయిందని, ఆ కాళీ ఘట్టమే నేటి 'కలకత్తా' అయిందని ఈ గాథా విదితం. సతీదేవి దేహంలో కటిప్రదేశంపై భాగాలు పడిన చోట 'శక్తిదక్షిణ మార్గోపాసన'కు, కటిప్రదేశం క్రింది భాగాలు పడినచోట 'శక్తివామమార్గోపాసన'కు విశేష ఫలప్రదంగా చెప్పబడినవి.

## బృహద్ధర్మ పురాణగాథ

విష్ణువు ఆషాఢ శుద్ధ ఏకాదశి నాటికి శేషశయ్యపై నిద్రించుననీ, 'దేవి'యును ఆ సమయమున నిద్రించుననీ, దక్షిణాయనము పూర్తియగువరకు వారట్లు నిద్రలో నుందురని బృహద్ధర్మ పురాణ ప్రతీతి. రామ రావణ యుద్ధము జరుగుచున్నప్పుడు రావణుని పరాక్రమమును తిలకించిన దేవతలు భీతిచెంది బ్రహ్మదేవుని వేడగా, బ్రహ్మ రామునికి విజయం సిద్ధింపచేసేందుకు దేవీ సహాయము నర్థించు నిమిత్తం నిద్రలోనున్న దేవిని మేల్కొలిపారట. బ్రహ్మ ఆశ్వయుజ శుక్ల నవమినుండి రావణ మరణము వరకు దేవిని పూజించుటకు అనుమతి పొందెను. దేవి ప్రసన్నురాలై నవమినాటి తృతీయ ప్రహరమున రావణ వినాశము కాగలదనీ, దశమి నాడు రాముడు విజయోత్సవమాచరించుననీ పలికెను. ఆనాటినుండి స్వర్గ, మర్త్యలోక వాసులందరూ ఆశ్వయుజ మాసమున దేవి నారాధించుట ఆరంభించిరి.

## 'ఇంద్రకీలాద్రి' వృత్తాంతము

అర్జునుడు ఇంద్రకీలాద్రి పర్వతంపై పాశుపతాస్త్రం కోసం ఘోర తపస్సుచేసి శంకరుని అనుగ్రహం వలన పాశుపతాస్త్రం పొందిన కిరాతార్జునీయ గాథ యెల్లరెరిగినదే. శంకరుడు అర్జునుని అనుగ్రహించుటతోబాటు ఇంద్రకీలుని మహాక్షేత్ర పర్వతరాజమై విరాజిల్లుమని దీవించెనట. శ్రీ కనకదుర్గ ఇంద్రకీలుని అభీష్టాన్నిమన్నించి ఇంద్రకీలాద్రిపై నివాసమేర్పరచుకొనినట్లు పురాణ ప్రతీతి. కనకదుర్గకు 'విజయాంబ' అని కూడ నామ ధేయము కలదని, ఆమె ఆశ్వయుజ శుద్ధ దశమినాడే ఇంద్రకీలాద్రిపైకి చేరెనని తత్సంకేతమే 'విజయదశమి' అని కూడ చెప్పబడుచున్నది.

— మారుతి

మీకు మీరుగాగమనించండి !

# ఇతర డిటర్జెంట్ ఉతికే బిళ్ళ లకన్నా బరువు రెండు రెట్లు ఎక్కువ. ధర కేవలం కొద్ది పైసలు ఎక్కువ!

300 గ్రాములు రూ. 3·20 (స్థానిక పన్నులు అదనం)

# టోటల్

## నీలి డిటర్జెంట్ ఉతికే బార్




### మొదటి "నిజమైన" డిటర్జెంట్ బార్!

టోటల్ - ఉతికే బార్ రీతిలో ఉన్నది. మరియు అధికమైన శుభ్రపరిచే నీలి డిటర్జెంట్ శక్తి ఉన్నది. మరి ఇంకేమి? హాయిపుగ ఉతికేందుకుగాను ఇది ఐదు చేతికనువైన భాగాలు కలిగివుంది.

### కేవలం కొద్దిపైసల హెచ్చుకే రెండు రెట్లు బరువు!

ఒక నిర్దిష్టమయిన డిటర్జెంట్ కేక్ 125 గ్రాముల బరువు కలదానికి మీరు ఎంత ఖర్చు పెడుతున్నారు? 250 గ్రాముల "టోటల్" ధర కేవలం రూ. 2.67. (300 గ్రాములకి రూ. 3.20). అదీను మామూలు డిటర్జెంట్ కేక్‌లకన్న రెండు రెట్లు బరువు ఎక్కువ. కేవలం కొద్ది పైసల హెచ్చుకే!

ఉతుకుటకు చేతికనువుగా ఐదు భాగాలు.

### ఆంధ్రప్రదేశ్, బీహార్ మరియు తమిళనాడులలో దొరుకును.

కర్ణాటక సోప్స్ అండ్ డిటర్జెంట్స్ లిమిటెడ్, బెంగుళూరు వారి ఒక నాణ్యమయిన ఉత్పాదన.
మార్కెట్ చేయువారు: మైసూరు సేల్స్ ఇంటర్నేషనల్ లిమిటెడ్, బెంగుళూరు

MCA-TDB-51-Tel




# త్యాగం-మోసం

కందుకూరి వెంకట మహాలక్ష్మి

పార్వతి పెట్టె అడుగున వున్న ఆల్‌బమ్ తీసింది అది పార్వతి పెళ్లి ఆల్‌బమ్. పెళ్లినాడు తీసిన ఫొటోలు కొన్ని కలర్‌వి, కొన్ని మామూలువి మొట్టమొదటి పేజీలో పెళ్లయిన వెంటనే తనూ, భర్తా తీయించుకున్న ఫుల్ సైజు ఫొటో అంటించివుంది పెళ్లికూతురు ముస్తాబులో నిండు జరీచీరతో ఎంతో అందంగా వుంది తరువాత గౌరీ తపస్సుది తరువాత జీలకర్రా, బెల్లం పెట్టుకుంటోన్నది తరువాత మంగళ సూత్రధారణ, తలంబ్రాలవి. ఇలా అన్ని టైముల్లో తీసిన ఫొటోలు అనేకం వున్నాయి ఆఖర్ని పార్వతీ, భర్త ఆనంద్ శోభనం గదిలో పాన్పుమీద కూర్చుండగా తీసిన ఫొటో. పాన్పు పూలమాలలతో అలంకరించివుంది ప్రక్క పేజీ తిప్పింది. ఖాళీ. ! ఆ ఖాళీ పేజీలాగే పార్వతి మనస్సుకూడా ఖాళీగానే వుండిపోయింది. ఒక్కసారిగా కన్నీళ్ళు ఉబికి బుగ్గలని తడిపేసాయి ఆ ఆల్‌బమ్‌లో ఆ తరువాత తమవి హనీమూన్ ఫొటోలు అంటించాలని, ఆ తరువాత చిన్నారి బాబుది, తరువాత చిన్నారి.. !!

కానీ పార్వతి జీవితంలో ఆ శోభనంనాటి రాత్రి ఫొటోతోటే జీవితంలోని ఆనంద ఘడియ అంతం అయింది ఆమె జీవితం మోడుబారిపోయింది అందరి జీవితాల్లోలాగ కాక, ఒక విచిత్రమైన మలుపు తిరిగింది. అందరి జీవితాల్లో తొలిరేయి మరపురాని ముద్రలని వేస్తే, ఆమె జీవితంలో అగాధం ఎదురయింది అది దూకలేనిదయింది

బయట తలుపులు గడియపెట్టేరు సిగ్గుతో మొగ్గలా ముడుచుకుని కూర్చుంది తొలిరాత్రి గురించి ఎన్నో కధలు చదివింది సినిమాల్లో ఎన్నో దృశ్యాలని చూసింది. అవన్నీ గుర్తొచ్చి గుండెలు దడ దడ లాడసాగాయి. చెప్పలేని భయం తలెత్తి భర్తవైపు చూడలేకపోతోంది చదువుకునే రోజుల్లో ఎందరి విద్యార్థినులతోటో కబుర్లు చెప్పేది కొన్ని, కొన్ని సందర్భాలలో వారి ప్రక్కన నిలబడేది కానీ ఎప్పుడూ ఇటువంటి అనుభూతి కలగలేదు. ఈ రోజు "భర్త" అనగానే చెప్పలేని గగుర్పాటు, ఉద్రేకం కలుగుతోంది. "ఈ రాత్రి ఎలాంటి అనుభూతుల్ని పొందుతానో? ఎలా ఎదుర్కోవాలి ?" అన్న ఊహాగానాల్లో తేలుతున్న తరుణంలోనే పార్వతి భర్త మంచం వద్ద కూర్చుని ఆమె మోకాళ్లవద్ద తలపెట్టి ఆమె రెండు చేతుల్ని తీసుకుని తన ముఖానికి అడ్డుపెట్టుకున్నాడు పార్వతి అరచేతులు వెచ్చగా తడవసాగాయి. పార్వతి ఖంగారుగా చేతులు తీసుకుని ఆనంద్ ముఖాన్ని పైకెత్తింది అతను ఏడుస్తున్నాడు. ఇంతసేపూ ఆమెలో కలిగిన అనుభూతులన్నీ ఒక్కసారిగా మాయమయ్యాయి. ఖంగారుగా 'ఏమయిందండీ ?' అంది తనే ముందుగా.

"పార్వతీ ! నీకు చాలా అన్యాయం జరిగిపోయింది పార్వతీ !"

"ఏమయిందండీ ! ఏం అన్యాయం జరిగిందిప్పుడు !?"

"పార్వతీ ! నీకు జరగరాని అన్యాయమే జరిగింది. నన్ను క్షమించు పార్వతీ !"

"నాకేం అర్థం కావటంలేదండీ ! చెప్పండీ అసలేం జరిగిందో !"

"పార్వతీ ! నేను నీకు భర్తగా అర్హుడిని కాను నేను నీతో కాపరం చెయ్యడానికి తగను. నేను నపుంసకుడిని. మగతనంలేని మగవాడిని" అంటూ ఏదో చెప్పుకుపోతున్నాడు.

అంతే – ఆమె చెవులు ఇంక అతను చెప్పుతున్న మిగతా విషయాలని విననివ్వడంలేదు "ఎంత ఘోరం, ఎంత అన్యాయం !" రక్తం కుతకుత ఉడకసాగింది 'మరి ఇంతదాకా తన్ని ఈ ఊబిలోకి లాగి వదిలెయ్యడంలో ఈ మహానీయుడి ఉద్దేశ్యం ? ముందు తెలీదా ? ఎందుకు పెళ్లి చేసుకుని నా జీవితాన్ని గంగపాలు చేసాడు ? కట్నకానుకలు అందుకోడానికేనా ఈ పెళ్లి చేసుకుంది ? ఏమిటీ నాటకం ?' ఆవేశం, ఏడుపూ, కోపం అన్నీ ఒకేసారి ముంచుకొచ్చాయి. నిస్పృహతో ఒక్కసారిగా మంచం మీదికి వాలిపోయింది

"పార్వతీ ! నన్ను క్షమించవా ? సిగ్గుచేత ఎవ్వరికీ చెప్పలేదు నా తల్లితండ్రులకి కూడా చెప్పలేదు నీ జీవితాన్ని నాశనం చేసాననుకోకు నీ జీవితాన్ని చక్కదిద్దే బాధ్యత నాది – కొన్నాళ్లు నా పరువు కాపాడు" అని ఆమెని లేవతీసి చేతులు పట్టుకుని బ్రతిమాలాడు అంత దుఃఖంలోనూ అతన్ని చూడగానే జాలిముంచుకొచ్చింది తల ఊపి నెమ్మదిగా లేచి అతని నుంచి తప్పించుకుంది మంచానికి అతనో ప్రక్కగా, పార్వతి ఒక ప్రక్కగా పడుకున్నారు తొలిరాత్రి ఆనందానుభూతులు అందర్నీ నిద్రపోనివ్వకపోతే, పార్వతిని ఆవేదన నిద్రపోనివ్వలేదు మంచానికి కట్టిన మల్లెలు వాడకుండా, నలక్కుండా పార్వతిని చూసి నవ్వేయి అంతే–తొలిరాత్రి అనుభవమే పార్వతి జీవితంలో ఈనాటివరకూ శాశ్వతంగా నిల్చిపోయింది ఏ ఉత్సాహంలేని పార్వతి ఏం హనీమూన్‌కి వెళ్తుంది ? బిడ్డల్ని ఎలా కంటుంది ?

పార్వతి ఆనంద్ బలవంతమీద బి ఏ పూర్తి చేసింది ఈమధ్యనే తన సిఫార్సుమీద ఒక మంచి కంపెనీలో ఆమెకి ఉద్యోగం వేయించాడు ఇద్దరూ

# మంగళకరమైన వెన్నెల మోమును మెరుగు పరచటానికి

# ఐటెక్స్

## మాట్ ఫినిష్ తిలకం

దేశమంతటా నాగరిక యువతులు కోరి ధరించేది ఐటెక్స్ తిలకం నారీమణుల పుష్ప వదనాన్ని అద్భుత సౌందర్యాన్ని ప్రస్ఫుటం చేసేటందుకే కల్పించిన 14 రంగులలో దొరుకుతున్నవి. శాస్త్రీయ విధానంలో తయారుచేయబడు ఐటెక్స్ తిలకం చర్మానికి ఎటువంటి హానియు కలుగజేయదు




**ఐటెక్స్**

38 సంవత్సరములుగ మీ నమ్మకానికి పాత్రమైన ఉన్నతమైన చిహ్నం

అరవింద్ లాబొరేటరీస్ మద్రాసు 600 033

ఆఫీసుకెళ్ళి వచ్చేవాడు. ఇంట్లో భార్యగా అన్నీ పన్లూ చేసుకునేది. నిరుత్సాహం చోటు చేసుకున్న ఆమె జీవితానికి ఉద్యోగం కాస్త ఉపశమనంగా వుంది. ఇంట్లో బరువెక్కిన గుండెలతో తన బాధ్యతలని నిర్వహించేది.

ఆ రోజు ఆనంద్, పార్వతి ఆఫీసునుంచి రాగానే కాఫీ తాగుతూ పార్వతిని పిల్చాడు. "పార్వతీ! ఇలారా—నీతో ఒక ముఖ్యమైన విషయం మాట్లాడాలి కూర్చో."

"ఏమిటండీ!"

"నీకు నావల్ల జరిగిన అన్యాయానికి న్యాయం చేకూర్చాలనుకుంటున్నాను పార్వతీ!"

పార్వతి మౌనాన్ని చూసి తిరిగి ఆనందే ప్రారంభించాడు —

"పార్వతీ! నువ్వు నాకు విడాకులు ఇచ్చేసి మళ్ళీ వివాహం చేసుకో!"

వెన్నులో వెనకనుంచి కత్తితో పొడిచినట్లుగా ఒక్కసారి తలెత్తి బితుకు, బితుకుగా ఆనంద్ వైపు చూసింది.

"నిజం పార్వతీ! నీకు చాలా ఘోరమైన అన్యాయం చేశాను. మా తల్లితండ్రుల కోసం ఇంత పాపాన్ని ఒడిగట్టుకున్నాను. ఇన్నాళ్లుగా నీవు పడ్డ ఆవేదన నాకు తెలుసు. ఇంక నిన్ను అలా చూడలేను. మనిద్దరం సమ్మతిస్తే విడాకులు తీసేసుకోవచ్చు. మా తల్లితండ్రులు గతించారు. వారికోసం ఈ పాపాన్ని చేసాను. నీ జీవితాన్ని చక్కటి పూలబాటగా మలచుకో. నందనవనం కావలసిన నీ జీవితం నావల్ల మోడుబారిపోయింది. పార్వతీ! ప్లీజ్ నీ అంగీకారాన్ని తెలిపితే లాయర్‌ని అడిగి కాగితం రాయించి తీసుకొస్తా."

ఈసారి జాలిగా అతనివంక చూసింది. "ఎంత నిర్మల హృదయం? ఎంత మంచితనం, ఎంత మంచి మనస్సు! సుగుణాలరాసి — పొగడదగ్గ మంచి లక్షణాలన్నీ ఆనంద్‌లోనే కూర్చి సృష్టించాడు ఆ భగవంతుడు. ఈ ఒక్క అవతారం లేకపోయి వుంటే తనెంత అదృష్టవంతురాలయ్యేది! తన జీవితం ఎంత మధురంగా వుండేది? ఇప్పుడు తనకి అన్నీ వున్నాయి. ఉండవలసినది లేదు. భర్తనుంచి జాలీ, సానుభూతితో కూడుకున్న ఆదరణ పొందుతోంది. తనకి కావలసింది అదేనా? కాదు! ఇన్ని స్వర్గసుఖాలు లేకపోయినా కావలసినది అతని అనురాగం, ఆప్యాయత, ప్రేమ — కానీ అవే తన జీవితానికి కొదవయ్యాయి. ఎంత సౌమ్యుడు? అతని బాధని తొలినాడే అర్థం చేసుకుంది. అందుకే ఇంత చిత్రవధని గుండెల్లో దాచుకుని, ఎవ్వరితో చెప్పకుండా, ప్రపంచానికి భార్యాభర్తల్లా కనబర్చుకుంటోంది. ఎంతో ఆనందంగా కనపడుతూ, రాత్రుళ్ళు ఒంటరిగా తన గదిలో గడియ వేసుకుని దిండుని కౌగిలించుకుని, తన దుఃఖాన్నంతా ఆ దిండుతో చెప్పుకుని, కన్నీటితో తడిపి, తన గుండె బరువుని దింపుకుని తేలికవుతోంది. "ఎన్నాళ్లిలా?" అన్న ప్రశ్న తన్ని వేధించకపోలేదు. కానీ ఈనాడు భర్త తన మనోవేదనకి ఇలాంటి పరిష్కారాన్ని చూపిస్తాడని మాత్రం ఊహించలేదు. తొలిరాత్రి అన్న మాటల పర్యవసానం ఇదేనా?

# త్యాగం-మోసం

నిజానికి నేను ఆనంద్‌కి విడాకులు ఇవ్వగలనా? ఇచ్చి మరో వివాహం చేసుకోగలనా? ఇన్నాళ్లూ దాచిన ఈ నిజాన్ని ఒక్కసారిగా తెలియజేస్తే ఈ ప్రపంచం నమ్ముతుందా? ఇన్నాళ్లూ ప్రపంచాన్నే మభ్య పెట్టేలా మసులుకున్నాము! ఇప్పుడు ఏమని చెప్పాలి? ఆనంద్ ఏమవుతాడు?" ఆలోచనలు ఒకదాని తరువాత ఒకటి తరుముకొస్తున్నాయి. జాలి, దయ నిండుకున్న గుండె బరువెక్కింది. మౌనంగా లేచి నిల్చుంది.

ఆమెని అర్థం చేసుకున్నట్లు ఆనంద్ "నెమ్మదిగా ఆలోచించి వారం, పదిరోజులలో నీ నిర్ణయాన్ని చెప్పు పార్వతీ! తొందరేం లేదు" అన్నాడు.

తలూపి లోపలికి వెళ్ళిపోయింది. ఆలోచనలతో బుర్ర వేడెక్కిపోతోంది. ఎటూ నిర్ణయించలేకపోతోంది. ఇటువంటప్పుడు సలహాలిచ్చే దిక్కుకూడా లేదు. అంతులేని ఆలోచనలతో రోజులు గడుస్తున్నాయి. వారం గడిచింది. "ఆనంద్ మళ్ళీ

## మతం - పరహితం

మతం
అంటే పరహితం!
అది అంతర్గతం!
అదే కావాలి అందరి కనగతం!

అంతరాలు పొంతం కావాలి అంతం!
అలా దీక్షపూనాలి మనం అనవరతం!
మనుషులు, మనసులు కావాలి మమతల పూరితం!
మతములు ఏకత్వంతో సాగాలి ముందుకు సతతం!

ఎవరి మతం వారికి పవిత్రం, పూజితం!
పరమ గౌరవప్రదం ప్రతివారికి పరమతం!
ఎల్లరదీ ఒకే మతం, సమానత్వం!
మానవత్వం, అదే మన మతం!

— బొర్రా పాండురంగశాస్త్రి

అడిగితే ఏం చెప్పాలి?" అన్నది తేల్చుకోలేకపోతోంది. మనస్సు అల్లకల్లోలంగా సముద్రంలో నావలా వుంది. "ఏం చెప్పను? ఏం చెప్పాలి?" అన్న ప్రశ్న వేధిస్తోంది. "నాలాంటి దానికి ఏ రోగమూ రాదేం? ఏ గుండెజబ్బో వచ్చి గుండె ఆగిపోకూడదూ? తనలాంటి నిష్ప్రయోజనకరమైన జీవి ఎందుకు బ్రతకాలి? బ్రతికి ఎవరి నుద్ధరించాలి? నాలాంటి వారికి చావురాదు. అది కూడా వరం వంటిదే!" ఆవేదనతో, ఆలోచనలతో తల తిరిగిపోతోంది. తలపోటు వచ్చేస్తోంది. ఏ పనీ చేయబుద్ధి కావటం లేదు. లేచి కాగితాలన్నీ పెట్టేసి ఆఫీసర్‌తో చెప్పి ఇంటికి బయలుదేరింది. భారంగా అడుగులు వేసుకుంటూ బస్సుస్టాండు వైపుకి నడిచింది.

ఆలోచనలతో బరువెక్కిన పార్వతి శరీరంపైని ఎవరిదో చల్లని చెయ్యి పడింది. వెనుదిరిగి చూసింది. హేమ!! ఆశ్చర్యానికి అంతులేదు. ఏనాడో కోల్పోయిన దరహాస రేఖలు పార్వతి ముఖాన్న మళ్ళీ అలుముకున్నాయి. "హేమా!" అంటూ కౌగిలించుకుంది. "పారూ!" అంటూ ఆమెని హత్తుకుపోయింది. అది బస్‌స్టాండు అన్న దృష్టే లేదు వారిద్దరికీ. స్నేహం, అందునా చిన్ననాటి స్నేహం అంత మధురమైనది. ఇద్దరూ ఆనందంలో మునిగిపోయారు. "ఏం మాట్లాడా"లన్నది మర్చిపోయి అలా నిల్చుండిపోయారు ఇద్దరి కళ్ళల్లో నీళ్ళు ఉబికివచ్చాయి. చుట్టూ జనం తమనే పరికిస్తున్నారన్న విషయాన్నే వాళ్ళు గమనించటం లేదు. కొద్ది క్షణాల తరువాత తేరుకుని "పారూ! మా ఇంటికి రావే ఇక్కడికి దగ్గరే" అంటూ మరో మాట వినకుండా పార్వతిని లాక్కెళ్ళింది.

తన్ని డ్రాయింగ్ రూమ్‌లో కూర్చోబెట్టి లోపలికి వెళ్ళింది. చిన్న పోర్షన్. చక్కగా నీట్‌గా సర్దుకుంది.

పార్వతీ, హేమా ఇంటర్‌దాకా కలిసి చదువుకున్నారు. ఆర్థిక ఇబ్బందులవల్ల హేమ అంతటితో చదువు ఆపేసి టైపూ, షార్ట్‌హేండూ నేర్చుకుని స్టెనోగా చేరింది. హేమ కుటుంబానికి పెద్ద కూతురవడంవల్ల సంసార బాధ్యతని నెత్తిన వేసుకుని తండ్రికి తన చేయూతనిచ్చింది.

పార్వతి బి. ఏ. లో చేరింది. హేమా, పార్వతీ అప్పుడప్పుడు కలుసుకుంటూనేవున్నారు. పార్వతీ, హేమాల స్నేహం విడలేని బంధం. హేమకి పార్వతి వద్ద దాపరికం లేదు. తల్లితండ్రులకి చెప్పుకోలేని కష్టసుఖాలని కూడా పార్వతికి చెప్పి ఉపశమనం పొందేది.

ఈ మధ్యకాలంలో అనేక మార్పులు జరిగాయి పార్వతి తండ్రిని నేపాల్ డెప్యుటేషన్‌మీద పంపారు పార్వతిది బి. ఏ. పోయింది. అంతటితో చదువు ఆపేసి తండ్రితో నేపాల్ వెళ్ళిపోయింది. నేపాల్ వెళ్ళిన తరువాత తరుచూ పార్వతీ, హేమా ఉత్తరాలు రాసుకునేవారు. నెమ్మ నెమ్మదిగా హేమ వద్దనుంచి ఉత్తరాలు రావడం ఆగిపోయాయి.

కాలచక్రం గిర్రున్న కొన్నేళ్ళపాటు తన కాలాన్ని తిప్పేసింది. అందులో ఎందరి జీవితాల్లోనో మంచి, చెడ్డలు మిళితమయ్యాయి. కొందరి జీవితాల్లో అంతామంచే, కొందరి జీవితాల్లో అంతా చెడే మరి కొందరిలో మంచితో ప్రారంభమయిన పయనం చెడుతో నిలుస్తే—మరి కొందరి జీవితాల్లో చెడుతో ప్రారంభమయినా సుఖాంతం అవుతుంది. ఆఖరివారే అందరిలోకి ధన్యులు. సుఖాంతం కాగానే చెడునంతా మర్చిపోతారు. దుఃఖాంతమయిన వారి జీవితాల్లోని తొలినాటి మధురానుభూతుల కూడా తియ్య, తియ్యగా బాధిస్తాయి.

ట్రేలో కాఫీ, టిఫన్‌లతో గదిలోకి ప్రవేశించిన హేమ "ఏమిటే ఆలోచిస్తున్నావు? నా గురించేనా?" అంది నవ్వుతూ. హేమలో ఇదివరకటి నిరుత్సాహం లేదు. చాలా హుషారుగా వుంది. ఇంకా పెళ్ళయినట్లులేదు. అయినా ఆనందమంతా తనదే అన్నట్లుగా వున్నాయి ఆమె మాటలు. కాఫీ, టిఫిన్‌లు కాగానే బైటనేవున్న తోటలో రెండు కుర్చీలు వేసింది. హేమ గురించి ఈ మూడు, నాలుగేళ్ల మధ్య కాలంలోని విషయాలని తెలుసుకోవాలని పార్వతి ఉబలాట పడుతోందనేకంటే, హేమ తన గురించి పార్వతికి చెప్పాలని ఎక్కువగా ఉర్రూతలూగుతోందనడం సహజం.

"పార్వతీ! నీకెన్నో విషయాలు చెప్పాలే

# హై పవర్ సర్ఫ్
## అమిత తెల్లగా ఉతుకుతుంది...
### అమిత తెల్లగా, కనువిందుగా.

మీ బాబు బట్టలు మురికి చేసుకోవడంలో ఘటికుడా? ఆ మురికి వదల గొట్టడానికి మీకూ ఘనమైనదే కావాలి మరి. అదే హై పవర్ సర్ఫ్.

హై పవర్ సర్ఫ్‌లో ఉంది అతి శక్తివంతమైన ఫార్ములా. దానిలోని హెచ్చు ఉతికే శక్తి మురికినీ, జిడ్డు మరకల్నీ మటుమాయం చేస్తుంది. బాగా మాసిపోయిన దుస్తుల్ని కూడా తెల్లగా మిలమిల మెరిసేలా చేస్తుంది సర్ఫ్. సర్ఫ్ రంగు బట్టలకు కూడా మంచిది. వాటిని పరిశుభ్రంగా, కాంతివంతంగా ఉంచుతుంది. ఇంటిల్లిపాది బట్టలకూ ఉతుకులో అదనపు తెల్లదనం, కాంతీ ఇస్తుంది హై పవర్ సర్ఫ్. ఎక్కువ మంది తల్లులు మరే ఇతర వాషింగ్ పౌడర్‌కు బదులు సర్ఫ్‌నే వాడటంలో మరి ఆశ్చర్యం ఏముంది గనక?






**ఎక్కువ మంది తల్లులు మరే ఇతర వాషింగ్ పౌడర్‌కు బదులు సర్ఫ్‌నే వాడతారు.**

హిందూస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

లింటాస్-SU 225 203 TL

నిజంగా ఎంత ఆనందకరమైన విషయమో నీకు చెప్తే నా అదృష్టాన్ని పొగడకుండా వుండలేవని నాకు తెల్సు. ఇంటర్‌తో చదువు ఆపేసి స్టెనోగా చేరేను కదా ? నేను పనిచేసే మా ఆఫీసుకి మా ఆఫీసర్‌గారి కొడుకు తరుచూ తండ్రికోసం వచ్చేవాడు. అతని కళ్లు ఎప్పుడూ నన్నే గుచ్చి గుచ్చి చూసేవి. సిగ్గుతో తలొంచుకునేదాన్ని. ఒకరోజు బస్‌స్టాండులో నేను నిలబడ్డాను. అతను నా ప్రక్కన వచ్చి నిలబడ్డాడు. మాటలు కలిపాడు. అలా తరుచూ వచ్చి కలిసేవాడు. ఒకనాడు నన్ను ప్రేమిస్తున్నానని చెప్పేడు. నేను నా స్థితి గతులు, నా బాధ్యతల్ని వివరించి చెప్పాను. దానికి అతను ''నాకు కావలసింది మీరుగానీ మీ ఐశ్వర్యం, సంపద కాదు. నేను ఆధునిక భావాలు గలవాడిని. అలాంటివాటిని పట్టించుకో''నని చెప్పాడు. ఆనాటి లగాయతూ తరుచూ ఇద్దరం కలుసుకునేవాళ్లం. అతను ఎమ్. ఎస్సీ. అయ్యాకా ఉద్యోగంలో చేరతానని, తరువాత నన్ను పెళ్లి చేసుకుంటానని మాటిచ్చాడు. కొన్నాళ్ల తరువాత అతను చదువురీత్యా వేరే వూరు వెళ్లేడు. కానీ తరుచూ ఉత్తరాలు రాసేవాడు. మా బాస్‌కి మెడ్రాస్ బదిలీ అయింది. ఆ తరువాత మళ్లీ నేను అతన్ని కలవలేదు ఒకసారి అతని దగ్గరనుంచి ఒక ఉత్తరం వచ్చింది. అందులోని సారాంశమేమిటంటే ''హేమా ! నా తల్లితండ్రులు నా భావాలకి విరుద్ధంగా వున్నారు పెద్దింటి పిల్లని కోడలిగా, పెద్ద కట్నం, సారె, చీరలతో తెచ్చుకోవాలని కోరుతున్నారని తెలిసింది. అందుకు వారు తెచ్చే సంబంధాలని చూడకుండా పి. హెచ్ డి. చేసేవరకూ పెళ్లి చేసుకోనని తప్పించుకుంటున్నాను. అటు కన్నవారిని ధిక్కరించలేను. ఇంకా నా చదువు నడిమధ్యలో వుంది కదా ? ఇటు ప్రేమించిన నిన్ను వదులుకోలేను. పి. హెచ్. డి. అయ్యేనాటికి నేను స్వతంత్రుడిని అవుతాను నిన్నే తప్పక నా భార్యగా తెచ్చుకుంటాను. అంతదాకా నాకోసం వేచివుండమని కోరుతున్నాను'' అని వ్రాశాడు.

పార్వతీ ! మనం అనుకున్నవి అన్నీ జరగవు. కని, పెంచి, విద్యాబుద్ధులు గరిపిన తల్లితండ్రుల్ని ఎదిరించి నన్ను చేసుకుంటే ఏం సుఖపడతాడు ? అందుకు ఇవే మాటల్ని హితబోధల రూపంలో అతనికి వ్రాశాను. అందులో అతని తప్పేముంది ?

# త్యాగం–మోసం

పరిస్థితులకి అతనూ తలొగ్గాలి కదా ? అనుకున్నా– కానీ ఉత్తరం పోస్టు చేశాకా అతన్ని క్షమించలేక పోయాను. ఇది ప్రతీ పురుషుడూ ఆడే నాటకం లాంటిదే కాదుకదా ? అని అనుకున్నాను. ద్వేషంతో ఛీత్కరించుకున్నాను. మళ్లీ అతనికి ఉత్తరం రాయలేదు. ఈ వూరు బదిలీ చేయించుకున్నాను.

మా సంసార బాధ్యతలన్నీ నామీదే వుండడంతో బరువుగా ఆ బండిని లాగేదాన్ని. కొన్నాళ్లకి నాన్నగారు పోయారు ! తమ్ముడు బి.కాం. పాసయి బ్యాంకి ఉద్యోగంలో చేరాడు. చెల్లాయి కూడా బి.ఏ చదివి పెళ్లి చేసుకుంది. ఇంక అమ్మ, నేనూ మిగిలాం. అమ్మ అప్పుడప్పుడు నన్ను పెళ్లి చేసుకోమనేది. నా మనస్సులోని ఆవేదన ఆమెకి చెప్పలేను. మరొకర్ని భర్తగా అంతకంటే స్వీకరించలేను. నా మనస్సు ఏనాడో అతనికి అంకితమయిపోయింది. కాలాన్ని ఇలా దొర్లిస్తున్నా. అమ్మ తమ్ముడి దగ్గర వుంటోంది. నా జీవితమింక ఇంతే అనుకున్నాను. కానీ విచిత్రమైన మలుపుతో ఒక్కోసారి చీకటిలోంచి వెలుగులోకివస్తారు కొందరు. నా జీవితంలో కూడా అలాంటి మెరుపే మెరిసింది పారూ ! మోడనుకున్న నా జీవిత మాను చిగురించింది. త్వరలో పువ్వులు పూస్తుంది; తరువాత కాయలు కాస్తుంది'' అంది ఎంతో ఉల్లాసంగా.

మళ్లీ నేను ఏమిటని అడిగేలోగానే హేమ ప్రారంభించింది. ''మొన్న బజారులో అనుకోకుండా మా బాస్ కొడుకు అంటే నా ప్రియాతి ప్రియుడు కనపడ్డాడు. ఒక్కసారిగా ఇద్దరం ఒకరి నొకరం చూసుకున్నాం. కలా, నిజమా ? అనుకున్నా. ఆనందం పట్టలేక ఏడ్చేశాను. కానీ అంతలోనే తమాయించుకుని, అతని ప్రస్తుత పరిస్థితులేమిటో ఎందరి బిడ్డల తండ్రో ? భార్యా, బిడ్డలతో నన్ను మర్చిపోయి ఆనందంగా వున్న అతను మళ్లీ ఎందుకిలా ఎదురయ్యాడు దేముడా ?'' అని నాలో నేనే అనుకున్నాను.

ఇంతలోనే ''హేమా! అలా పార్కులోకి వెళ్దాం అభ్యంతరమా ?'' అన్నాడు. మౌనంగా అతన్ని అనుసరించాను. అతను తన గురించి చెప్పడం ప్రారంభించాడు. ''ఎమ్.ఎస్సి. తరువాత పి. హెచ్ డి. చేసే వంకతో పెళ్లి తప్పించుకున్నాను. తరువాత మరికొన్నాళ్లు ఉద్యోగం దొరికేదాకా చేసుకోనని తప్పించుకున్నాను. ఈ మధ్య కాలంలో నా తల్లీ, తండ్రీ మరణించారు. ఆ తరువాత నీకోసం ఎన్నో జాగాలు గాలించాను. నీ జాడ తెలీక పోవడంతో నేను బ్రహ్మచారిగానే వున్నా''నని చెప్పగానే నా దురాలోచనలకి నన్ను నేనే తిట్టుకున్నాను. నేనూ అతనికోసం అవివాహితగానే వున్నట్లు తెలిపాను. త్వరలోనే అతను, నేను పెళ్లి చేసుకోబోతున్నామే ! చూడు పార్వతీ ! నాలాంటి ఒక దురదృష్టవంతురాలికి, చీకటినే తప్ప వెలుగుని చూడనమకున్నదానికి ఇలాంటి అదృష్టమైన మలుపు తిరుగుతుంద: అనుకున్నావా ? ఒసే పారూ ! మా పెళ్లికి తప్పక రావాలే. ఆఫ్‌కోర్సు రిజిస్టర్ మేరేజ్ అనుకో. అన్నట్లు నీకు గుర్తువుందా ? చిన్నప్పుడు అనుకునేవాళ్లం నా శోభనం రాత్రి ముస్తాబు నువ్వు, నీ శోభనం రాత్రి ముస్తాబు నేనూ చెయ్యాలని ! నాకా అదృష్టం పట్టలేదనుకో – నీకు పట్టింది. మరి నీవేల ముస్తాబు చేయించుకోవడం నాదీ అదృష్టమేగా ? మరి ఎంత చక్కగా ముస్తాబు చేస్తావో ? మావారు నన్ను పొగిడితే ''మా పారూ అలంకరించిం''దని చెప్తాలి. అన్నట్లు చూడు నా తెలివి ! నా ప్రియుని ఫొటో చూపించనేలేదు.'' అంటూ తూనీగలా లోపలికెళ్లి ఓ ఆల్‌బమ్ తెచ్చింది. కొత్త ఆల్‌బమ్ మొదటి పేజీ తియ్యగానే ఫుల్‌సూట్‌లో వున్న నిండైన విగ్రహం హేమ ప్రియునిది. ఆ ఫొటో పార్వతిని కదిల్చివేసింది. హేమ అదృష్టాన్ని పైకి పొగడలేకపోయింది. కానీ హేమ పార్వతిని గమనించే స్థితిలో లేదు ''ఒసే పారూ ! ఈ ఆల్‌బమ్ కాబోయే మా శ్రీవారి ఫొటోతో ప్రారంభమయిందే ! త్వరలో మా ఇద్దరి ఫొటోలు, ఆ తరువాత హనీమూన్‌లో మా జ్ఞాపకాలు, ఆ పైని మా ప్రేమ పంట ప్రతిఫలం. అందుకే మా కాబోయే శ్రీవారి ఫొటో కొత్త ఆల్‌బమ్ కొని అంటించా'' అంది ఆల్‌బమ్‌ని జాగ్రత్తగ పెట్టెలో పెడుతూ.

''హేమా వస్తానే! చాలా చీకటి పడింది'' అని లేచింది. ''ఏమే పార్వతీ ! నీ గురించి ఏమీ చెప్పలేదే ?''

''ఏముందే! పెళ్లి చేసుకున్నా, ఏ లోటూలేదు పిల్లలులేరు. కాలక్షేపానికి ఉద్యోగం చేస్తున్నా

# గోద్రెజ్® స్టోర్‌వెల్®

## కొద్దిగా ఎక్కువ ధర అంతే, మరి దానికి బదులుగా ఎన్నెన్నో లాభాలు



### ఎక్కువ దృఢమైనది. ఎక్కువ భద్రమైనది.
### ఎంచుకునేందుకు ఎక్కువ రకాల్లో. ఎక్కువగా మన్నేది.

**ఎక్కువ దృఢమైనది:**
విశిష్టమైన స్టీలుతో చేయబడినది. తుప్పును నిరోధించేది.
స్టీలు అల్మారాలన్నిట్లోకి సర్వోత్తమమైన ఫినిష్.

**ఎక్కువ భద్రమైనది:**
లాకర్ మరియు దర్వాజాలకి విరగని గోద్రెజ్ తాళం.
పైకి కనిపించని బందులు, దర్వాజాని పైనుంచీ కిందనుంచీ మూసివేయడానికి త్రీ-వే ఇంటర్ లాకింగ్ సాధనం.

**ఎంచుకునేందుకు ఎక్కువ రకాల్లో:**
పైకీ క్రిందికీ వీలుగా చేసుకోగలిగే షెల్ఫులు. టయ్-బార్. హేంగర్-రాడ్, లాకర్. నిలువుటద్దం. మీ అవసరాలకి అనుగుణమైన తీరులో, కలయికలో.

**ఎక్కువగా మన్నేది:**
మూడు తరాలదాకా నిలుస్తుంది; బాగా నిలిచి పనిచేసేందుకోసమే తయారుచేయబడినది.

మోడల్స్: స్టోర్‌వెల్ వార్డ్‌రోబ్ (చిత్రించబడినది), కాంపాక్ట్, మైనర్.
ఇప్పుడు గోద్రెజ్ సేఫ్‌మైరా కూడా దొరుకుతోంది.

సచిత్ర కరపత్రం కోసం రాయండి:
**గోద్రెజ్ & బాయిస్ మాన్యు. కం. ప్ర. లి.**
మార్కెటింగ్ డిపార్ట్‌మెంట్, పిరోజ్‌షా నగర్, బొంబాయి 400 079.

ప్రఖ్యాతి చెందిన వస్తువులు నిర్మించేవారు గోద్రెజ్® Godrej®

ULKA/GBS/1/80 TEL

అంతకంటే గొప్ప విశేషాలేం లేవు. మళ్ళీ నేనే వస్తాను'' అంటూ బయలుదేరింది.

కొందరి జీవితాల్లో తీపి, ఆరువాత చేదు. మరికొందరి జీవితాల్లో ముందు చేదు, తరువాత తీపి. "హేమకీ నాకూ ఎంత తేడా? లేనింటిలో పుట్టినా అదృష్టాన్నంతా తనపరం చేసుకుంటోంది. తను పెద్దింట్లో పుట్టింది అదృష్టమంతా తనదే అని అనుకుంది. చివరికి ఈదలేని సముద్రంలో పడిపోయా.''

హాల్లో ఆనంద్ కూర్చుని పేపరు చూసుకుంటున్నాడు. త్వర, త్వరగా వెళ్ళి వంట వండింది. అన్నం తింటున్న ఆనంద్ "పార్వతీ! నీ నిర్ణయమేమిటి?'' అన్నాడు. "లాయర్‌చేత రాయించుకు రండి'' అంది ముభావంగా

మర్నాడే ఆనంద్ లాయర్‌తో సహా ప్రత్యక్షమవడం పార్వతికి కొంచెం ఆశ్చర్యాన్నే కలిగించింది. నిన్నటి మాటల్ని ఇంత త్వరగా ఆచరణలో పెడతాడని అనుకోలేదు. లాయరు ఆమె ఎదురుగా వ్రాసిన కాగితంపై సంతకం పెట్టేసింది. లాయర్ వెళ్ళిపోయాడు.

పార్వతి స్నానానికని టవల్ తీసుకుని బాత్‌రూమ్‌వైపు వెళ్ళింది. నిజానికి తను వెళ్ళింది స్నానానికి కాదు ఆమె గుండెల్లోని బరువు దింపుకోడానికి. కళ్ళల్లోంచే పొంగి వచ్చే వరద నీటికివున్న గట్లని చాటుగా తెంపెయ్యడానికి. మనస్సు తీరా ఏడ్చింది "ఈ ఇంటితో నాకు ఋణం తీరిపోయింది. నాకూ, నా భర్తకీ ఇక ఎటువంటి సంబంధంలేదు. నేను ఇప్పుడు భర్తని విడిచిన ఆడదాన్ని. ఇది ఒక వింత వార్త. ఇరుగు, పొరుగులకి కొన్నాళ్ళ తన కథా కాలక్షేపంగా వుంటుంది. నేను చేసినది తప్పా? ఒప్పా? అని మనస్సుని ప్రశ్నిస్తే మనస్సు ఏమీ సమాధానం చెప్పటంలేదు. అయిపోయింది ఇంక ప్రయోజనం లేదు'' అనుకుంది.

మర్నాడు ఆదివారం పార్వతి బట్టలు ఓ పెట్టెలో సర్దుకుని ఆ ఇంటికి వీడ్కోలు చెప్పడానికి లేచింది ఆనంద్ ఓ బేగ్ తెచ్చి పార్వతికి ఇచ్చాడు. అందులో ఓ చెక్కుబుక్కు, పాస్‌బుక్కు వున్నాయి. పదివేల రూపాయలు సేవింగ్సులో తన పేర వేశాడు అదికాక పాతికేసి వేల రూపాయలవి మూడు డిపాజిట్లు వున్నాయి. "ఇన్నాళ్ళూ నేను చేసిన చాకిరీకి ప్రతిఫలమా?'' అనుకుని ఆ సంచీని బల్లపైనే పెట్టేసింది. పెట్టె తీసుకుని బరువుగా కదిలింది. ఆనంద్ వైపు చూడలేదు. అతనూ తలొంచుకున్నాడు. చెప్పాలన్నా ఏముంది?? దుఃఖంతో నిండిన గుండెల్ని మోసుకెళ్తోంది ఆటో స్టార్టయింది అంతే! ఇద్దరిమధ్యా వున్న బంధాన్ని పూర్తిగా తెంపేసిందా ఆటో. ఆటో వేగంతోపాటు పార్వతి బుర్రలోని ఆలోచనల వేగం పోటీ పడుతోంది. "నేను మళ్ళీ పెళ్ళాడగలనా? హేమ తనని ప్రేమించిన ప్రియుడు పెళ్ళాడకపోతే అతనికోసం జీవితాంతం అలాగే వుండిపోతానంది. మరి పెళ్ళాడిన తను భర్తని వదిలేసినా మరొకరిని పెళ్ళాడగలదా? ఒకవేళ మళ్ళీ ఆనంద్ వచ్చి "పార్వతీ! ఏదో పొరపాటు చేశాను. నువ్వు లేందే బ్రతకలేను, వచ్చెయ్యి'' అంటే ఏం చెయ్యాలి.

## త్యాగం — మోసం

వెళ్ళిపోతానా? అంటే? భార్యాభర్తల మధ్య వుండవలసిన సౌఖ్యం లేకపోయినా భర్త దగ్గరే వుండి కాపరం చెయ్యాలని స్త్రీ కోరుతుందన్నమాట.'' ఆటోడ్రైవర్ బ్రేక్ వెయ్యడంతో పార్వతికూడా తన ఆలోచనలకి బ్రేక్ వేసి, నెమ్మదిగా దిగి సామాన్లు దింపుకుని, అద్దెకి తీసుకున్న రూమ్‌లోకి ప్రవేశించింది. గదిలో సామాను పెట్టి మంచం వాల్చుకుని పడుకుంది ఈ గదిలోకి వచ్చాక ఆమెలో ఏదో ధైర్యం ప్రవేశించింది. "నేను చేసింది మంచి పనే'' అని అనిపిస్తోందిప్పుడు లేచి చకచకా అన్ని సామాన్లూ నీట్‌గా సర్దుకుంది "నేను ఇప్పుడు హేమ పాత ఫ్రెండు పార్వతిని, నాలో ఏ మార్పూ లేదు. బాహ్యంగా ప్రపంచానికి కనపడ్డవన్నీ నాపట్ల కల్లలే. నాకు ఉద్యోగం వుంది ఏం లోటు? భర్త పోయిన స్త్రీ బ్రతకటంలేదూ?'' అనుకుంది. సాయంత్రం బయలుదేరి హేమ దగ్గరకి వెళ్ళింది.

### గెలుపు కోసం

స్వార్థం
— ప్రగతి పీక పిసుకుతుంటే
న్యాయం
— నాలుక తెరిచి చూస్తోంది
మంచితనానికి రూపం కరుగుతోంది.
'ప్రగతి'ని రక్షించడానికి
న్యాయానికి బలమివ్వడానికీ,
అంతా ఏకమవుదాం.
మతకల్లోలాల్లోంచి
మగత నిద్రల్లోంచీ
లేచి
బద్ధకాన్ని విడిచి
'స్వార్థం' మీద
యుద్ధం ప్రకటిద్దాం.
న్యాయానికి గెలుపుంటుందని
నిరూపిద్దాం.

— మంత్రవాది మహేశ్వర్

ఇద్దరూ గతంలోకి జారి అనేక విషయాలని నెమరు వేసుకుని ఆనందించారు

తరుచూ హేమా, పార్వతీ కలుస్తున్నారు పార్వతిని హేమ రెండు, మూడుసార్లు ఆమె భర్త గురించి అడిగింది కలకత్తా బదిలీ అయిందనీ, అక్కడ రెండేళ్ళున్నాకా తిరిగి ఈ ఊరు వచ్చేస్తారనీ, ఉద్యోగం వదలడం ఇష్టంలేక ఇక్కడే ఈ రూమ్ తీసుకున్నాననీ చెప్పేది.

పార్వతికి ఆనంద్ మళ్ళీ కనపడలేదు. కొన్నాళ్ళ తరువాత ఆనంద్‌కి ఆ వూరునుంచి బదిలీ అయిపోయినట్టు తెలిసింది. ఇన్నాళ్ళూ గాలిలో ఊగిన గాలిపటం పూర్తిగా తెగిపోయిందనుకుంది పార్వతి ఆ విషయం తెలిసాకా.

ఆనందంతో, పరుగులాంటి నడకతో వచ్చింది హేమ. "పారూ! మా పెళ్ళికి తేదీ నిర్ణయం అయిందే ఆ సాయంత్రం తప్పక రావాలి చెప్పేనుగా! ఆ రాత్రి అలంకరణ బాధ్యతంతా నీదే'' అని మరీ, మరీ చెప్పి వెళ్ళిపోయింది.

పార్వతి ఆ సాయంత్రం బజారులోకి వెళ్ళి మల్లెపూలు, కనకాంబరాలూ కలిసికట్టిన మాల, సంపెంగల చెండు పొట్లం కట్టించి హేమ ఇంటికి బాగా చీకటపడ్డాకా చేరింది. ఎర్రని కాశ్మీర్ సిల్కు చీరలో కంకల్లాడుతూ ఎదురొచ్చింది హేమ రిజిస్టర్ మేరేజ్ కావడంవల్ల మెడలో మాంగల్యాలు లేవు. పార్వతి తెచ్చిన పూలల్లో కొన్ని హేమ జడలో అలంకరించి, మిగిలినవి ఆమె పడకగదిలో ఎందిరి మంచానికి కట్టింది. సాయంత్రం తెల్లటి జరీచీర పార్వతే కట్టింది

రాత్రి పది దాటింది హేమ తల్లి పార్వతినే వెళ్ళి హేమని గదిలోకి పంపిరమ్మంది. పార్వతి మౌనంగా హేమ చెయ్యి పట్టుకుంది ఇద్దరి అడుగులూ తడబడుతున్నాయి "హేమ ఆనంద సాగరంలోకి అడుగెట్టబోతోంది నాలాంటి దురదృష్టకరమైన జీవితం, నాలాంటి తొలిరేయి మా హేమకి ప్రసాదించకు భగవాన్!'' అని దేముడిని ప్రార్థిస్తూ మెట్లెక్కసాగింది పార్వతి. హేమకి ఆకాశంలోకి ఎగిరిపోతున్నట్లుగా వున్నాయా మెట్లు పార్వతికి అగాధంలోకి జారిపోతున్నట్లున్నాయా మెట్లు. ఏమిటీ చిత్రం? దైవ విధా? మరొక్క మెట్టు ఎక్కితే తను హేమని భర్తవద్దకి పంపిస్తుంది. "హేమ సిగ్గుతో ముడుచుకుపోతోంది. పెళ్ళికూతురనగానే ఈ సిగ్గు ఇలాగే ముంచుకొస్తుంది లాగుంది'' అనుకుంది పార్వతి.

"హేమా! నీతో ఒక విషయం చెప్పాలని ఎన్నాళ్ళగానో ఎదురుచూస్తున్నాను. ఇన్నాళ్ళూ చెప్పకుండా దాచినందుకు మన్నించు నేనూ, నా భర్త కొన్ని కారణాలవల్ల విడాకులు తీసుకున్నాం. "ఎందుకు?'' అని అడగొద్దు. చెప్పను. ఇది ఈ టైములో నీతో చెప్పవలసిన విషయం కాదు కానీ భారత స్త్రీకి ఒక్కడే భర్త. కట్టుకున్నవాడయినా ఒక్కడే, మనస్సులో ప్రేమించినవాడైన ఒక్కడే. నువ్వు కోరుకుని భారత స్త్రీగా నిలబడి అతడినే చేసుకున్నావు. నేను చేసుకుని విడాకులు ఇచ్చుకున్నా అతడినే భర్తగా నమ్ముతున్నా ఈ ఉపోద్ఘాతమంతా ఎందుకంటే పెళ్ళికూతురి కళని తెచ్చే మాంగల్యం నీ మెడలో లేక వెలవెలపోతోంది. అవి విలువ లేకుండ నావద్ద వున్నాయి. మరోలా అనుకోక నా కోరిక మన్నించి న మంగళసూత్రాలని ఇస్తాను వేసుకో'' అని పర్సులోంచి తీసి హేమ మెడలో వేసి గట్టిగా కౌగలించుకుని, ఏదో అడగబోతున్న హేమని మరేం మాట్లాడనివ్వకుండా గది తలుపులు తీసి లోపలికి పంపించింది. గదిలో హేమ కోసం నిరీక్షిస్తున్న ఆనంద్ పార్వతిని చూసి ఉలిక్కిపడి లేచి నిలబడ్డాడు. నిజం దాగదు. అయినా ఇంత త్వరగా తెలుస్తుందనుకోలేదు. ఈ విధంగా ఎదుర్కోవాలని అసలే అనుకోలేదు. అతని ఖంగారుని అర్థం చేసుకున్న పార్వతి, ఏమీ ఎరగనట్లు గది తలుపులు దగ్గరగా వేసి మౌనంగా మెట్లు దిగి వచ్చేసింది. సరాసరి తన గదికే వచ్చేసి కరువుతీరా ఏడ్చింది. ఏడ్చి, ఏడ్చి తన్నితనే ఓదార్చుకుంది. పెట్టె తీసింది అట్టడుగున వున్న తన పెళ్ళి ఆల్బమ్‌లో ఖాళీగా వున్న పేజీలని చింపేసి బయట పారేసింది. శోభనం ఫొటో క్రింద 'ఎండ్' అని వ్రాసి పెట్టేసింది. ●

# ఇప్పుడు 20 పై. తగ్గింపుతో అందుకోండి

## ట్రిలో

ఇప్పటికే ఇతర వాటికన్న 25% తక్కువ ఖరీదైన నీలి డిటర్జెంట్ బిళ్ళ!

ట్రిలోతో వచ్చే నురుగు ఎక్కువ—గనక మీరు మరెన్నో బట్టల్ని ఉతికే వీలు. మరే యితర డిటర్జెంట్ బిళ్ళతో కన్న మరింత ఎక్కువగా!

ట్రిలో ఎంతో బాగా శుభ్ర పరుస్తుంది—బాగా మురికి పట్టేసిన మీ బట్టల్ని కూడా శుభ్రపరచగల శక్తిగలది యిది. దీంట్లోనే గల నీలి మందు మీ బట్టల్ని మరింత తెల్లగా, తాజాగా రూపొందిస్తుంది.

ట్రిలో మరెంతో కాలం మన్నుతుంది—ఇది ముద్దగా అయిపోదు. దీన్ని పూర్తిగా అరిగిపోయేదాకా వాడేవీలు.



అదనంగా నురుగు

అదనంగా శక్తి

అదనంగా పొదుపు

NEW Triple action Trilo BLUE DETERGENT WASHING TABLET

Extra lather* Extra power* Extra economy*

A Godrej PRODUCT

Trilo

ఇప్పుడే కొని చూడండి—త్రివిధ చర్యగల ట్రిలో ఎంత ఎంతెంత మేలైనదో !

గోద్రెజ్ ఉత్పాదన

CHAITRA-G-144 TEL

# ధర్మపథం

— బులుసు వేంకటరమణయ్య

## రాధా తత్త్వము

రాధాదేవిని గురించి భాగవత, విష్ణు పురాణాలలో లేకపోయినా బ్రహ్మవైవర్త పురాణం మున్నగు వాటిలో విపులంగా ఉన్నది. ఆమె శ్రీకృష్ణునికి మేనత్త అనీ, వయస్సులో పెద్దదనీ కొందరనుకుంటున్నారు. వయస్సులో ఆమె అతనికంటె కాస్త పెద్దదనీ, మేనత్త కాదనీ, భగవదాజ్ఞవల్ల గోలోకంలో ఉద్భవించి, శ్రీకృష్ణునే యథావిధిగా వివాహమాడినట్లు బ్రహ్మవైవర్తంలోని శ్రీకృష్ణ ఖండంలో ఉన్నది. భగవానుడు ఆత్మ అయితే, ఆమె శరీరమట! వారిద్దరికీ భేదమే లేదట! రుక్మిణి, సత్య మున్నగు మహిషుల కంటె రాధతోడి పొందికయే కృష్ణునకు ఎక్కువ. 'రాధాకృష్ణ' నామానికి గల ప్రచారం 'రుక్మిణీకృష్ణ, సత్యాకృష్ణ' నామాలకు లేదు. ఆ మాధుర్యమూ లేదు. అసలు అట్టి పదాలు వినబడడమే అరుదు.

రాధా శబ్దానికి ఎన్నో అర్థాలు ఉన్నవని పురాణాలవల్ల తెలుస్తున్నది. ముఖ్యమైన వానిని మాత్రం తెలుసుకుందాం. భవిష్యోత్తర పురాణంలో ఇలా ఉన్నది —

"సురాసుర మునీంద్రాణాం
వాంఛితాం ముక్తిదాం పరామ్,
రేఫో హి కోటి జన్మాఘం
కర్మభోగం శుభాశుభమ్,
ఆకారో గర్భవాసం చ
మృత్యుం చ రోగముత్సృజేత్.
ధకార ఆయుషోహాని
మా కారో భవబంధనమ్.
స్మరణ శ్రవణోక్తిభ్యః
ప్రణశ్యంతి న సంశయః."

రాధా శబ్దం ఉచ్చరించినా, విన్నా, స్మరించినా కూడా ఎంతో మేలు కల్గుతుంది. అది దేవతలకు, దానవులకు, మునులకు మోక్షాన్ని అనుగ్రహిస్తుంది. రేఫ—ఆకార—ధకార—ఆకారాలందులో ఉన్నవి కదా! రేఫ — కోట్లకొలది జన్మలలో చేసిన పాపాలను పోగొట్టి, జీవునికి శుభాశుభ కర్మల అనుభవాలనుండి విముక్తిని కలిగిస్తుంది. ఆకారం గర్భవాస, మృత్యు రోగ భయాలను దూరం చేస్తుంది. ధకారం జీవిత ప్రమాణాన్ని అంతమొందిస్తుంది. ఆకారం, సంసార బంధాలనుండి తొలగిస్తుంది. మరిన్నీ 'ర' విశ్వల కృష్ణభక్తిని, సేవను, 'ఆ'కారం ఈశ్వర ప్రాప్తిని కలిగిస్తుంది. ధకారం భగవంతుని తోడి సహవాసాన్నీ, ఆ కారం తేజస్సునూ, యోగశక్తి మున్నగువానిని అనుగ్రహిస్తుంది. పయి విషయం కూడా ఆ పురాణంలో చెప్పబడింది. ●

---

## డాక్టర్ సలహాలు

### కె. ఎమ్. - పెదపాలెం

నాకు మూడు సం॥ల నుండి నరములు బలహీనముగా వుంటున్నవి. సంవత్సరము క్రితం విరోచనములో దోషము వుందని మాత్రలు వాడినాను అవి వాడిన దగ్గరనుండి ఆకలి బాగుగనే వున్నది కాని నరములలో బలము రావటంలేదు. బలానికి ఏమైనా మందులు వాడినా ఉపయోగము కన్పించుటలేదు

★ మీరు తిరిగి మల పరీక్ష చేయించుకొని క్రిములు ఉంటే వాటికి తగిన మందులు వాడాలి.

నరాల బలహీనత బి 1 – బి 6 – బి 12 ఇంజక్షన్లు రోజు విడిచి రోజు 10 ఇంజక్షన్లు చేయించుకొని, దంపుడు బియ్యం అన్నం ప్రతిరోజూ తింటే తగ్గిపోతుంది.

### ఆర్ ఆర్. - హైదరాబాద్

నా వయస్సు 27 సం॥లు. నేను మలవిసర్జన రోజుకి రెండు, మూడుసార్లు వెళ్ళవలసి రావటం వల్ల మల పరీక్ష చేయించినాను రిపోర్టులో స్టార్చ్ (అన్‌డైజస్టడ్) అన్నచోట ప్రజంట్ (+) అని పేర్కొన్నారు కనుక స్టార్చ్‌ని డైజస్ట్ చేసుకోటానికి ఏ మందులు వాడనుంటారు ?

★ స్టార్చ్ ఎక్కువగా తీసుకోవటం తగ్గించాలి వ్యాయామం చేయాలి. రోజుకి ఆరు వంతున వరుసగా నెల రోజులపాటు బి. కాంప్లెక్స్ మాత్రలు వాడండి.

### పి డి ఆర్. — కోరాపుట్

నాకు కంటిపాపపై మచ్చ ఏర్పడినది. దీనిని నయముచేయుటకు ఏ మందులు వాడవలెను

★ కంటిపాపపై తెల్లని మచ్చ ఏర్పడి చూడటానికి అసహ్యంగా ఉంటే నిపుణులైన నేత్ర వైద్యులు పిగ్‌మెంటేషన్ వేసి నయం చేయగలరు (ఆ తెల్లమచ్చని రంగు మచ్చగా మార్చగలరు.)

పై పై మందులవల్ల రంగు మారదు.

### ఎన్ ఆర్. కె ఆర్ - విశాఖపట్నం

నా కడుపు కాస్త ఎత్తుగా వుంటుంది. అది తగ్గాలంటే ఏమి చెయ్యాలి ? అన్నం తిన్నవెంటనే పొట్ట బాగా ఎత్తుగా వుంటుంది. ఇది తగ్గి పొడుగు ఎదగాలంటే ఏమి చెయ్యాలి ?

★ కడుపు ఎత్తుగా ఉన్నవారు ఆహారం మితంగా తీసుకొంటూ దానికి తగిన వ్యాయామం చేసుకొంటూ ఉండాలి. ప్రతిరోజూ ఉదయం, సాయంత్రం 2 కి.మీ.ల దూరం నడిస్తే చాలా మంచిది. అలా నడుస్తున్నాం కదా! శక్తి తగ్గిందని వెంటనే మామూలుకన్నా ఎక్కువ ఆహారం తీసుకొంటే పొట్ట ఇంకా ఎక్కువ అవుతుంది.

పొడుగు ఎదగటానికి పెద్దగా మందులుగాని, శస్త్రచికిత్సలుగాని ఏవీ లేవు.

### ఎస్. జె. బి - నెల్లూరు

నేను 5 సం॥ల క్రితం వెసక్టమి ఆపరేషన్ చేయించుకున్నాను. నాకు పుట్టిన ఇద్దరు పిల్లలు మరణించినారు. కాబట్టి నాకు మరల పిల్లలుపుట్టే అవకాశము వున్నదా? వెంటనే తెలుప ప్రార్థన.

★ రీకెనలైజేషన్ ఆపరేషన్ చేయించుకొంటే మరల పిల్లలు పుట్టే అవకాశం ఉన్నది

### యస్ ఎల్. - గూడూరు

మా బాబుకు పుట్టినప్పుడు ఎడమ బుగ్గమీద నయాపైసా అంత ఎర్రని దద్దురువున్నది. అది క్రమేపి పెద్దదై ఇప్పుడు రూపాయి బిళ్ళంత వున్నది బాగా ఉబ్బివున్నది. ఎరుపు రంగునుండి ఇప్పుడు ముదురు ఎరుపుగా మారినది. అప్పుడప్పుడూ ఎల్లగా రక్తం కారుతుంది. ఈ మచ్చవల్ల పిల్లవానికి ఎలాటి బాధలేదు?

★ దీనిని హెమాన్‌జియోమా అని అంటారు దీనిమీద వేళ్ళతో వత్తితే తెల్లగామారి, వేళ్ళు తేసిన వెంటనే యథావిధిగా ఎర్ర రంగురావటం జరుగుతుంది.

ఈ మచ్చలవల్ల బయటికి అసహ్యంగా ఉండటం మినహా ఏ బాధా ఉండదు.

దీనిని తొలగించటానికి శస్త్రచికిత్స చేయటం, లేకపోతే, వేడినీటిని ఇంజక్షన్ ద్వారా ఎక్కించటం చేస్తారు.

—డా॥ కె. వెంకటేశ్వరరావు

# దసరా మామూళ్ళు - శేఖర్



















SEKHAR


ఒకప్పుడు డెన్సర్ పాత్రలే!
ఇప్పుడు పతివ్రతా వేషాలు!


నన్ను అయ్యగారు పంపించారండీ!
తెలిసినాయన బస్తా పంచదార
ఇప్పిస్తానన్నారట - మిమ్మల్ని అడిగి
వంద రూపాయలు
పట్రమన్నారు!


ఒకప్పుడు గొప్ప రౌడీ!
ఇప్పుడు ప్రజానాయకుడు!!


వేషాలు
బాపు


చాల్లెండి -
దొంగ వేషాలు!
నా నగ ఎత్తుకెళ్ళి
తాగి తందనా
లాడదామనేగా!...


తమరు అవినీతి నిరోధక
శాఖనుండి వచ్చినవారు కాదని
ఒట్టేస్తేనే - ఇది
తీసుకుంటాను!

# విమల్ వారి విశిష్ట ఉత్పాదన:
# కోర్డ్ మరియు ఎస్ & జడ్ సూటింగ్ శ్రేణి

ఈ సూటింగ్స్ అన్నీ భారతదేశంలోని ఒకే ఒక్క కలర్ కంప్యూటర్ పై
రంగులు మేచ్ చేయబడ్డాయి.





రిలయన్స్ టెక్స్‌టైల్స్ వారి కలర్ మేచింగ్ కంప్యూటర్.
ఇది భారతదేశంలోని ఒకేఒక్క టెక్స్‌టైల్ కలర్ మేచింగ్ కంప్యూటర్.




# అద్వితీయ విమల్ సూటింగ్స్

పర్ స్టైల్ * సింథెటిక్ * లోకప్రియ

భారతదేశంలోని అత్యంత ఆధునికమైన టెక్స్‌టైల్ మిల్లువారి ఉత్పాదన

# తమాషా మీద తమాషా!!

— కవిత





బొమ్మలతో వటికవిత

"అపరంజి బొమ్మ
అభినందనమ్మ,
ఆహ్వానమ్మ
అందుకోవమ్మ...15, రామనాథన్ స్ట్రీట్,
టి' నగర్, మద్రాస్–17"

పై విధంగా అడ్రస్ రాసిన ఒక పెద్ద కవర్‌ను తీసుకొచ్చాడు పోస్ట్‌మన్ ఓ రోజున మా ఇంటికి. "ఈ బుక్‌పోస్ట్ మీకే ననుకుంటాను," అంటూ ఆ కవర్‌ను ఇచ్చేసి వెళ్ళిపోయాడు.

ఆ కవర్‌మీది అడ్రస్ చూశాను. ఇంటి నెంబరు, వీధిపేరు అంతా కరెక్టే. మా అడ్రసే. సందేహం లేదు. ఐతే, అడ్రస్ మీద పేరు రాయకుండా ఇదేమిటి? నాకేం పాలుపోలేదు.

బొమ్మల విముపాబు చేసున్న కవిత

ఆ కవర్ లోపల అందంగా ముద్రించబడిన ఓ ఆహ్వాన పత్రిక ఉంది. 'బొమ్మల కొలువు'కు ఆహ్వానమన్న మాట అది. చివరన 'ఒ' అంగ్ల అక్షరం, దానిపక్కన తీగబొమ్మ వేసి ఉంది. ఇంకో పన్నెను!

నా ఒళ్ళు మండిపోయిందంటే నమ్మండి. పొగరు కాకపోతే, ఎందుకు నన్నిలా తికమకలు పెట్టడం?

మళ్ళీ కవర్‌మీది అడ్రస్ చూశాను. ఆ తర్వాత అరగంటకుగాని నాకు అర్థమైంది కాదు — అలా అడ్రస్ మీద నా పేరు స్ఫురించేలా 'కవిత' ఎవరో రాశారని. ఈ 'క్లూ' తెలిశాక ఇక ఆ ఇన్విటేషన్‌ను పంపిందెవరో కూడా ఇట్టే తేల్చుకోగలిగాను. 'తీగ' బొమ్మ... అంటే, లత! కరెక్ట్!! నా క్లాస్‌మేట్ బి. లత పంపిందది.

ఈ తమాషాను మా ఇంట్లోని వారందరికీ చూపించాను. అందరం నవ్వుకున్నాం.

లతకీ కొంటెబుద్ధి ఇంకా పోలేదన్నమాట.

లత చాలా చురుకైన పిల్ల. కాని, ఆమె కన్నా నాలుగు ఆకులు ఎక్కువే చదివాను నేను.

కళ్ళు మూసుకున్నాను...

ఫ్లాష్‌బాక్...

ఒకసారి మా ఊళ్ళో క్వార్టర్లీ ఎగ్జామినేషన్స్ రాసి, లత నేను హాలు బయటకు వచ్చాం.

"లతా! ఎప్పుడు పెడతారే మీ ఇంట్లో బొమ్మల కొలువు?" అని అడిగాను.

"వేరే బొమ్మల కొలువు ఎందుకే — నేనే ఒక బొమ్మ ఉండగా?" అని జోకేసింది లత.

"నీ మొహం! మీ ఇంటి పేరులోనే ఉందే బొమ్మ," అన్నాను.

ఈ జోకుమీద జోకుకు మాతోపాటు మిగతా స్నేహితురాండ్రు కూడా గొల్లున నవ్వారు.

ఇంతకీ, ఆ అమ్మాయి పూర్తి పేరు ఏమిటంటే —

'బొమ్మనేని లత!'

తమాషాగా లేదూ?

తాజా వార్తలకు, వ్యాఖ్యలకు, కొంగ్రొత్త ప్రత్యేక శీర్షికలకు ఆంధ్రపత్రిక దిన పత్రిక పెట్టింది పేరు...మీరు మీ కాపీ మీ ఊరి ఏజెంటుద్వారాగాని లేదా మానేజరు, గాంధీనగరం, విజయవాడ - 3 లేదా మానేజరు, బషీర్‌బాగ్, హైద్రాబాద్-29 కి గాని వ్రాసి పోస్టులో తెప్పించుకొనండి.

# సినిమా

—జి.వి.జి.

'నాయుడుగారబ్బాయి'లో కవిత, కృష్ణ

## రామాపురంలో సీతలో రామలింగం మేనల్లుడు

రామలింగం (పి. ఎల్. నారాయణ) బుసలు కొడుతూ ఇంట్లోకి ప్రవేశిస్తూనే "ఇదిగో... నేను కరాఖండీగా చెప్తున్నాను. బాగా విను. ఈ రోజు మంచి పిడికి కొంపలో అన్నం పెట్టడానికి వీల్లేదు. నేనిలాగంటున్నానని కాదు — అంతే!" అన్నాడు.

మురళి (రామకృష్ణ)కి ఏమీ పాలుపోలేదు. తాయారు (పుష్పకుమారి) "అదేం మాటలండీ?" అంది.

"కాకపోతే ఏమిటే? లక్షణంగా పెళ్ళి చేసుకుని ఒకింటివాడివి కారా — అని నెత్తిన నోరు పెట్టుకొని పోరాను. విన్నాడా? ఓ చక్కని చందమామను తెచ్చుకుని, ఇల్లు లక్షణంగా చక్కదిద్దుకోరా — అని వాగాను. విన్నాడా? నేనిలా గంటున్నానని కాదు — విన్నాడా?" కాలు కాలిన పిల్లిలా ఇటు అటు తిరుగుతూ అన్నాడు రామలింగం.

"నిజమేరా! బోలెడు సంబంధాలొస్తున్నాయి. నువ్వు ఊ అన్నావంటే — ఏదో ఒక సంబంధం నిశ్చయం చెయ్యాలనుకుంటున్నారు మీ మామయ్య," అంటూ మురళికి నచ్చజెప్పింది తాయారు.



'అల్లుళ్ళొస్తున్నారు'లో గీత

రామలింగం చివాలున ఆగాడు. "అంటే, నువ్వనడంలేదా? నేనిలాగంటున్నానని కాదు... ఇద్దరం అంటున్నాం! వాడ్ని ఏదో ఒకటి చెప్పమను. నా మాటమీద గౌరవం ఉండి, నేను తెచ్చిన సంబంధం ఒప్పుకుంటాడా — సరే... లేదా, నేనిలాగంటున్నానని కాదు ఈ వేళతో నీకూ — నాకూ ఉన్న సంబంధం..."

మురళి "నేను మీ మాటెప్పుడు కాదన్నాను? మీ ఇష్టం," అంటూ లేచాడు.

తాయారు పరమానందంతో "నా నాయనే... చూశారా? మీరు ఊరికే అరుస్తారుగాని, వాడు మన మాట ఎప్పుడు కాదన్నాడు?" అంది.

రామలింగం ఉబ్బితబ్బిబ్బవుతూ, "నువ్వు నోరు ముయ్యవే! వాడెవడనుకున్నావు — ఈ రామలింగయ్య మేనల్లుడు. నేనిలాగంటున్నానని కాదుగాని, వాడు..." అంటూ మీసం తిప్పాడు.

ధవళ సత్యం స్క్రీన్ ప్లే, మాటలు, దర్శకత్వంలో జి. శ్రీనివాస్, జి. గణేశన్ నిర్మించే ఆర్. కె. మూవీస్ "రామాపురంలో సీత" చిత్రంలో చంద్రమోహన్, సుజాత, రమాప్రభ, మమత, సాక్షి, జీవా ఇతర ముఖ్య పాత్రధారులు.



'మహా పురుషుడు'లో సుజాత, రామారావు, జయసుధ, ప్రభాకరరెడ్డి

## సినిమా

రామకృష్ణ, శారద, లత, అల్లు రామలింగయ్య, పి. ఎల్. నారాయణ, పండరీబాయి, గిరిజ, మమత, పి. ఆర్. వరలక్ష్మి, పి. కె. రంజిత్, గెస్ట్‌గా ప్రభాకరరెడ్డి పాల్గొంటున్నారు. డాక్టర్ ఎం. రాధాకృష్ణయ్య సమర్పణలో పి. కమలమ్మ, బి. జె. రెడ్డి, పి. కృష్ణమూర్తి నిర్మాతలు. సముద్రాల జూనియర్ మాటలు, వేటూరి గీతాలు, సత్యం సంగీతం, రంగా ఛాయ, వేణుగోపాల్ కూర్పు, రవీంద్ర గోపాల్ సహకార దర్శకత్వం, ఎస్. వి. రాజకుమార్ ప్రొడక్షన్ నిర్వహిస్తున్నారు. "అక్టోబర్ మొదటి వారంలో తిరుపతిలో జరిగే షెడ్యూల్‌తో షూటింగ్ పూర్తవుతుంది," అన్నారు నిర్వాహకుడు అమర్‌నాథ్.

'భలే కాపురం'లో జయసుధ, చంద్రమోహన్



### కలియుగ దైవంలో కలికాలపు రామలక్ష్మణులు

శ్రీనివాసరావు (శరత్‌బాబు) సూట్‌కేసుతో రావడం చూసి రామలక్ష్మణులు (సూధా, జీవా) స్తోత్రం మొదలెట్టారు.

"సోదరా, నువ్వు నిజంగా లక్ష్మీపుత్రుడవు."

"అంతేకాదు; లక్ష్మీ భర్త కూడా."

"నీ సంపాదన చూసి నిజంగా మేం గర్వ పడుతున్నాం."

"ఒక విధంగా సిగ్గుపడుతున్నాం."

"నువ్వు పెద్దమ్మ కడుపున పెట్టినట్టావు."

"మేము మా అమ్మ కడుపున చెడబుట్టాం."

శ్రీనివాసరావు విసుక్కుంటూ, "సరి సరి... ముందొచ్చిన పని చెప్పండి," అన్నాడు.

"సోదరా, నీకో సచ్చి నిజం చెబుతున్నా విను. పచ్చగడ్డి కావాలి పశువులు బతకడానికి. పచ్చ కాగితాలు కావాలి మనుషులు బతకడానికి," అన్నాడు రాముడు.

"పచ్చగడ్డి లేకపోతే పశువులు ఎండు గడ్డయినా తిని జీవిస్తాయి. అదే పచ్చనోట్లు లేకపోతే మాకు పిచ్చెక్కినట్లుంటుంది," అన్నాడు లక్ష్మణుడు.

"ఈసారికి మమ్మల్ని కరుణించు, సోదరా! రెండు వేలిచ్చుకో, సోదరా!" అన్నాడు రాముడు.

శ్రీనివాసరావు ఇక ఆవేశం అణచుకోలేక "చూడండి ... ఇప్పటికే అమ్మ దగ్గర ఎన్నోసార్లు డబ్బు పట్టుకెళ్ళారు. అన్నయ్యా, అయినవాళ్ళని మేమూ సంతోషించాను. కాని, ఆ డబ్బును మీరు దుబారా చేస్తున్నారని తెలుసుకొని, బాధ పడ్డాను ... హుఁ ... గడ్డిమేసే పశువులు కూడా పాలిస్తాయి; ఎద్దులు చాకిరీ చేస్తాయి. కాని మీరు ? ... తండ్రి ఆస్తిని పాడుచేసి, అప్పులు చేస్తూ, జల్సాగా తిని తిరగడం నేర్చుకున్నారు. అప్పుచేసి పప్పుకూడు – అనేది మానాభిమానాలున్న మనుషులు చేసేపని కాదు ... నా కష్టార్జితాన్ని మీలాంటి సోమరిపోతులమీద వెచ్చించి పాడు చేసుకోలేను ... మీ కాళ్ళమీద మీరు నిలబడే ప్రయత్నం చెయ్యండి. నేను సహాయం చేస్తాను. ఇంకెప్పుడూ ఇలా డబ్బు కోసం మాత్రం రాకండి. వెళ్ళండి!" అని కసిరాడు.

శ్రీ రాఘవేంద్ర ఆర్ట్స్ క్రియేషన్స్ "కలియుగ దైవం" చిత్రానికి కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహించే ఎం. ఆర్. రాజా. "ఇంతవరకు సగం రీళ్ళ చిత్రం తయారైంది," అన్నారు.






## డబ్బు ! డబ్బు !! డబ్బు !!! లో కాలు జారితే, చెయ్యి జారుతుంది

మీనాక్షి (రాజసులోచన) ఇంట్లో గోవిందు (నూతన్‌ప్రసాద్), కొండమ్మ (రమాప్రభ) పని చేస్తున్నారు. ఒకరోజు పెరట్లో కొండమ్మ ఒంటరిగా ఉండడం చూసి, "అబ్బ! దీనందం అరబ్బు దొంగకైతు కెళ్లా ... కొండా!" అంటూ దగ్గరగా వచ్చాడు గోవిందు.

"కొండా గిండా అంటున్నావు. ఒళ్ళు ఎలా ఉందేంటి ?" నొసలు చిట్లించింది కొండమ్మ.

"అవునూ ... నన్ను దొంగతనం చేయొద్దని నువ్వు మాత్రం చేయొచ్చా ? నా మనసుని దొంగిలించావు."

"ఛీ ఛీ ! నీ మనసును దొంగిలించటానికి అదేమన్నా ఎండిపళ్ళెమా, లేకపోతే కోడిపెట్టా ?"

'అద్దాల మేడ'లో అంబిక, మురళీమోహన్

'చట్టానికి కళ్ళు లేవు' లో మాధవి, లక్ష్మి

"పోనీలే ... నేనే నీ మనసును దాలీ సైకిలనుకొని దొంగతనం చేశాను. సరే ... నాకు నీతో కాలు జారాలని ఉంది."

"కాలు జారాలని ఉందా ? అలా నూతి దగ్గరకెళ్లు. జర్రుమని జారుతావు."

"ఛ ఛ ... ఆడది కాలు జారడమంటే ... "

"అర్థమైందిగాని, నువ్వెళ్లి తలుపు వెయ్యి."

"ఓరి గోవిందూ! నీ పంట పండిందిరా !" అని సంబరపడుతూ వెళ్లి తలుపేసివచ్చిన గోవిందు చెంప చెళ్ళుమనిపించింది కొండమ్మ. గోవిందు కళ్లు బైర్లు కమ్మాయి.

"మరి ... నువ్వు కాలు జారాలన్నావు గదా ? అందుకే నేను చెయ్యి జారాను," అంది కొండమ్మ.

"ఈ మాత్రం దానికి తలుపెందుకు వేసి రమ్మన్నావు ?"

"నువ్వు మగాడివి కదా – నలుగురూ చూస్తే బాగుండదని తలుపేసి రమ్మన్నాను."

"ఓహో ! కొద్దిగా కన్సెక్షన్ ఇచ్చావన్నమాట? అయితే, నేనంటే నిజంగానే నీకు ప్రేమ లేదా ?"

"ఛ ఛ ... దొంగతనం చేసిన సైకిల్ని అమ్ముకోవడం చేతకాని చవటని ప్రేమిస్తే, రేపు నేను అడుక్కు తినాల్సిందే. ఇంకెప్పుడైనా కాలు జారుతాను, కీలు జారుతాను – అన్నావనుకో. ఇదిగో – ఇక్కడ కాదు. నాలుగు రోడ్లు కలిసే జంక్షన్ లేదా - అక్కడపెట్టి చెయ్యి జారుతాను... జాగ్రత్త ! మొహం చూడూ ... వెళ్ళు. పోయి పని చూసుకో, గాడిదా ! ఎళ్లి తలుపు తియ్యి !" అంది కొండమ్మ.

గోవిందు ఏడ్పుముఖంతో వెళ్లాడు.

విజయ బాపినీడు స్క్రీన్‌ప్లే, నేతృత్వంలో మాగంటి రవీంద్రనాథ్‌చౌదరి నిర్మించిన శ్యాం ప్రసాద్‌వారి "డబ్బు ! డబ్బు ! డబ్బు !" చిత్రంలో మురళీమోహన్, మోహన్‌బాబు, ఈశ్వరరావు, ప్రభాకరరెడ్డి, నూతన్‌ప్రసాద్, రాధిక, ప్రభ, రమాప్రభ, నిర్మల, రాజసులోచన, ఒక కీలకపాత్రలో ప్రతాప్ పోతన్ పాల్గొన్నారు. శ్యాం సంగీత దర్శకుడు, గోపాలరెడ్డి ఛాయాగ్రాహకుడు. జి. రామమోహనరావు దర్శకుడు.

### రాగం - తానం – పల్లవి

"సెప్టెంబర్‌లో సాంగ్స్ రికార్డు చేస్తాం. అక్టోబర్ నుంచి షూటింగ్ ఉంటుంది," అన్నారు టి. ఎల్. వి. ప్రసాద్. ఈయన దర్శకత్వంలో డాక్టర్ టి. కె. ఎం. ఛటర్జీ నిర్మించే రావ్స్ శ్యామ్స్ క్రియేషన్స్‌వారి పై చిత్రంలో చిరంజీవి, హరిప్రసాద్ ఆదిగాగల వారుంటారు. భాగ్యరాజ్ కథకు కాశీ విశ్వనాథ్ సంభాషణలకర్త. చక్రవర్తి సంగీతం, పి. దేవరాజ్ ఛాయ, సత్యం కూర్పు నిర్వహిస్తారు.

విజయబాపినీడు

శ్యాంప్రసాద్ ఆర్ట్ ప్రొడక్షన్స్

# డబ్బు! డబ్బు! డబ్బు!




# సినిమా

## నాయుడుగారబ్బాయిలో సుకుమారి ప్రెస్టేజి

సుకుమారికి బొత్తిగా ఇంగ్లీషు తెలీదుగాని, వచ్చీరాని ఇంగ్లీషులో మాట్లాడాలని తాపత్రయం. ఆమెకు తెలిసిన ఒకే పదం 'పిస్టేజి'. మాటిమాటికీ ఆ పదాన్ని ధోర్లిస్తూంటుంది ఒకరోజు ఆమె ఎందుకో బట్లర్‌మీద కోప్పడుతూ, "ఛీ ఛీ ఛీ. నా పిస్టేజంతా నాశనం చేస్తున్నారు," అంటూ హాల్లోకి వచ్చింది.

హాలులో నాగేశ్ ఉన్నాడు. ఇదివరకెన్నోసార్లు ఆమె 'పిస్టేజి' అనగా విన్నాడు. ఈ మారుమాత్రం ఆ మాటకు అతని వొళ్ళు మండింది "పిస్టేజా! ఏమిటే పిస్టేజీ? అసలు ప్రెస్టేజంటే ఎలాగుంటుంది?" అన్నాడు.

"నా మొహంలా ఉంటుంది," అని గొణిగింది

"ఓహో! మంగలి షాపులోకి వెళ్లి జుత్తు కత్తిరించుకోవేమా నీ ప్రెస్టేజా?" అంటూ ఓ చురక వేశాడు నాగేశ్.



'కలియుగ దైవం'లో శారద

అంతే ఆముదం తాగినట్టు ముఖం పెట్టేసింది సుకుమారి

బి వి. ప్రసాద్ దర్శకత్వం వహించే రాజీవి ఫిలిమ్స్ "నాయుడుగారబ్బాయి" చిత్రానికి దాసరి కధ, స్క్రీన్‌ప్లే, మాటలు సమకూర్చారు ఎన్ రామలింగేశ్వరరావు, గోపీనాధ్ నిర్మాతలు.

## సుబ్రహ్మణ్యస్వామి లీలలు

దేవర్ నిర్మించిన పై తమిళ చిత్రం తమిళనాడులో ఆరు కేంద్రాల్లో గోల్డన్ జూబ్లీ జరుపుకుంది. దీనినే ఎం. రాజేంద్రబాబు తెలుగులో శ్రీ నళినీ సినీ క్రియేషన్స్ (తెనాలి) పతాకంలో తెలుగులో డబ్ చేస్తున్నారు వేటూరి మాటలు, పాటలు రాశారు. బి గోపాలం సంగీతం, బాబూరావు కూర్పుతో సంజీవి నిర్వహణ బాధ్యతలు వహిస్తున్నారు కె ఆర్ విజయ, షావుకారు జానకి, నాగేష్ ప్రభృత నటవర్గం

# సినిమా

## అల్లుళ్ళొస్తున్నారులో అతిథి సత్కారం

గోపీ (చిరంజీవి)ని ఇంటికి తీసుకొచ్చాడు తప్పతాగిన చలం (చలం). "ఇదే, గురూ! మన ఇల్లు. శ్రోతలు కోరకపోయినా — తిట్లూ, చీవాట్లూ ప్రచారం చేసే ఆకాశవాణి ఆఫీసు ఇదే... నువ్వేం పట్టించుకోవద్దు. అన్నిటికీ నవ్వేస్తూ ఉండు," అంటూ చలం తలుపు తట్టి, "చెల్లెమ్మా, సీతా! తలుపు!" అని అరిచాడు.

లోపల ఏదో పనిలో ఉన్న సీత గొణుక్కోవడం మొదలెట్టింది: "వచ్చాడు దొర... ఊరిమీద అచ్చోసిన ఆంబోతులా తిరగడం అయింది. అన్నయ్యాయి ఉండీ ఎన్నిసార్లు చెప్పినా బరువు బాధ్యతలు తెలుసుకోడు. అడ్డగాడిదలా తిరగటం, తిండికి ఇంటికి రావటం, పావలా కనిపిస్తే పట్టుకుపోయి తాగటం... ఉండు నీ పని చెప్తా."



'గిరిజా కళ్యాణం'లో సుమలత

చలం తేలికగా నవ్వేస్తూ, "గురూ! ఇవాళ ఆంబోతు, అడ్డగాడిద అందా? నిన్న తమాషాకి వెధవ, వాజమ్మ అంది. రోజుకో టైపులో తిడుతూంటుంది మా చెల్లెమ్మ," అని సర్దబోయాడు.

అయినా, గోపీకి ఏదో అనుమానంగానే ఉంది. "అది సరే... ఉండు. నీ పని చెప్తా — అంది. ఏం చేస్తుందంటావ్?"

"అందీ? ఏం లేదు, గురూ! ఏదో మాట వరసకి అంటుందిగాని, ఏ స్వీటో, హాటో పట్టుకొస్తుంది తినడానికి. నీకెందుకూ — అలా నువ్వు నవ్వుతూ ఉండు," అంటూ గోపీని ముందుకు తోసి, తాను వెనక నిలుచున్నాడు.

సీత తలుపు తెరుస్తూ, "నీ తాగిన మత్తు వదలాలంటే, ఇదే నీకు మందు," అంటూ చేతిలోని బక్కెట్ నీళ్ళను గోపీమీద కుమ్మరించింది. వెంటనే తన పొరబాటును గుర్తించి, "అరే! మీరా? మన్నించండి. మీరని తెలీక..." అంటూ బాధపడింది. చలంను చూసి, "సిగ్గు లేకపోతేసరి. నీతోపాటు అయన్ని తీసుకొచ్చినట్టు ముందే చెప్పొచ్చుగా — తలుపు, తలుపు అని అరిచేబదులు?" అని మండిపడింది. మళ్ళీ గోపీవంక జాలిగా చూస్తూ, "లోపలికి రండి. షర్టు తీసి ఎండలో వేస్తే కాస్సేపట్లో ఆరిపోతుంది," అంది.

"షర్టు సంగతి మేం చూసుకుంటాంగాని, ముందు మా సంగతి చూడు," అన్నాడు చలం.

"లోపలికి రండి — భోంచేద్దురుగాని," అంటూ సీత లోపలికెళ్ళింది.

"గురూ, నువ్వివాళ వచ్చావ్. నాకు తిట్లు తప్పాయ్," అని చలం, "గురూ, ఇవాళ నువ్వు నాకు దొరికావ్. ఫుడ్ దొరికింది," అంటూ గోపీ చెట్టాపట్టాలేసుకొని సీతను అనుసరించారు.

కె. వాసు దర్శకత్వంలో పి. వి. సుబ్బారావు సమర్పించే బి.ఆర్.ప్రొడక్షన్స్ "అల్లుళ్ళొస్తున్నారు" చిత్రానికి కిలారు బాబూరావు నిర్మాత.

## చిత్రాలలో ప్రాణులు

### ఏనుగు

దేవర్ ఫిలివ్స్ "రామలక్ష్మణులు"లో పాల్గొన్న ఏనుగు రేమాండ్ సర్కస్ కంపెనీలో తర్ఫీదు పొందింది. దాని పేరు లక్ష్మణ్. వయసు 14. తీపి పదార్థాలంటే దానికి ఎంతో ఇష్టం. అంచేత షూటింగప్పుడు బెల్లంలాంటి ఏ తీపి పదార్థాన్నో ఎదురుగా ఉంచితే, చెప్పినట్టు చేస్తుంది. హీరో కృష్ణంరాజు తరచు చాక్లెట్లు ఇచ్చి దాన్ని మచ్చిక చేసుకున్నారు. లోగడ ఏనుగుతో దేవర్ ఫిలివ్స్ వారు ఎన్నో చిత్రాలను నిర్మించారు. అసలు ఆ సంస్థ మోనోగ్రామ్‌లోనే ఏనుగు ఉంది. ఈ ప్రస్తావన వచ్చినప్పుడు డైరెక్టర్ త్యాగరాజన్ "ఎంత పెద్ద ఏనుగునైనా ఇట్టే మచ్చిక చేసుకోవచ్చు. వాస్తవానికి అది ఎంతో సాధువు. ఒక పాపాయి బొమ్మను నేలమీద పడేసి, దాన్ని తొక్కమంటే తొక్కదు. పసిపాప ఏడ్పు వింటే చాలు — ఏనుగు అదోలా అయిపోతుంది," అన్నారు. "రామలక్ష్మణులు"లో పాల్గొన్న గణేశ్ అనే గున్న ఏనుగును దేవర్ ఫిలివ్స్‌వారే పెంచుతున్నారు.

### పాములు

కొన్ని చిత్రాలలో ప్రధానంగా కనిపించేది ఒక్క పామే అయినా — కొన్ని సన్నివేశాలలో దానికి కూడా "డూప్" వేయవలసి వస్తూంటుంది. సెట్‌లోని లైట్ల కాంతికి, వేడికి పాము వాడిపోయి పడగ ఎత్తకపోతే, ఆ షాట్‌కు వెంటనే మరో పామును ఏర్పాటు చేసుకోవాలి. కోరలు తీసేసినా — నటీనటుల దగ్గరుండేటప్పుడు నోటిని కుట్టేస్తారుకూడా. మరో విషయం... గిన్నెలోని పాలను పాము పైకి పీల్చి తాగలేదు. ఆ పాలను కొద్దికొద్దిగా తీసేస్తూ ట్రిక్ షాట్స్ ద్వారా ఆ ఎఫెక్ట్ తీసుకొస్తారు.

### తేళ్ళు

"మదనమంజరి"లో వందలాది తేళ్ళు నటి విజయలక్ష్మి తలమీదినుంచి కిందికి రాలే సన్నివేశం... దాదాపు అయిదు వందల తేళ్ళను అడవులనుంచి గాలించి పట్టుకొచ్చారు పాములవాళ్ళు. ఒక తేలుకు రోజుకు మూడు రూపాయల అద్దె. వాటిని చూడగానే విజయలక్ష్మికి ముచ్చెమటలు పోసేశాయి. వాటి కొండెలు తీసేశారని ఎంత భరోసా ఇచ్చినా ఆమెలో భయం పోలేదు. "అన్నిటికీ తీసేశారన్న నమ్మకం ఎలా? ఏదైనా ఒకదానికి పొరబాటున తీసేయకుండా వదిలి ఉండొచ్చుగా? అదేదైనా నా తలమీద కుట్టితే, నా గతి?" అని భయపడుతూనే నటించిందామె. దైవవశాత్తు ఆమె భయపడ్డట్టు ఏమీ జరగలేదు.

### కోతి

"మదనమంజరి"లో పాల్గొన్న కోతి పేరు సావిత్రి. మధురకు ఎనభై మైళ్ళ దూరంలో ఉన్న కడవాళి అనే గ్రామంలో జేమ్స్ అనే అతను పెంచుతున్నాడా కోతిని. దాన్ని నటింపజేయాలంటే చిన్న చిట్కా ఉంది. దాని పిల్లను జేమ్స్ ఎత్తుకొని ఎదురుగా నిలుచుంటే, ఆ పిల్లవంకే చూస్తూంటుంది సావిత్రి. ఆ పిల్లను ఎత్తుకొని జేమ్స్ పరుగెత్తితే, సావిత్రి కూడా పరుగెత్తుతూంటుంది. ఒకసారి మద్రాసు సమీపాన వండలూరు ప్రాంతంలో ఔట్‌డోర్ షూటింగ్ జరుగుతూంటే, ఎండ తీవ్రతకు ఆ పిల్ల శోషిల్లి, కాస్సేపటికి చచ్చిపోయింది. కన్నబిడ్డ కన్ను మూసినందుకు సావిత్రి కన్నీరుమున్నీరుగా విలపించింది. రెండు మూడు రోజులపాటు ఏ తిండీ ముట్టుకోలేదు. ఆ తర్వాత మరొక కోతిపిల్లను ఎక్కడ్నుంచో తెప్పించి, సావిత్రితోపాటు ఉంచసాగారు. కొత్తల్లో ఆ పిల్లను దగ్గరికి చేరనిచ్చేదికాదు సావిత్రి. మూడు రోజులపాటు రెండిటినీ ఒకే బోనులో ఉంచారు. దాంతో రెండింటికీ అనుబంధం ఏర్పడింది. ఆ తర్వాత ఆ కోతిపిల్లను ఎదురుగా ఉంచితే, సావిత్రి సునాయాసంగా నటించగలిగింది. సావిత్రికి దినసరి బేటా ఎనభై రూపాయలు. ద్రాక్ష, ఆపిల్, బాదంపప్పు, పాలు వగైరా రాజభోజనం. అది మరమరాలు నములుతూంటే — పెదవులు కదిలిస్తూ, మాట్లాడుతున్న ఎఫెక్ట్ సృష్టించవచ్చు. ఆ చిత్రంలో సావిత్రిని పొట్టేలు రాము కొమ్ములతో ఎత్తిపడేసే సన్నివేశం చిత్రీకరించడానికి ఎన్నో వేల అడుగుల ఫిలిమ్ వృధా అయింది.

రోజా మూవీస్

# కొండవీటి సింహం

ఈస్ట్‌మన్‌కలర్



## సి ని మా

### రోహిణీ క్రియేషన్స్

"ఫస్ట్ షెడ్యూల్ మద్రాసులోనే అక్టోబర్ 2 నుంచి వారం రోజులపాటు జరుగుతుంది. నవంబర్ 15 నుంచి డిసెంబర్ 10 వరకు హైదరాబాద్‌లో జరిగే రెండవ షెడ్యూల్‌తో షూటింగ్ పూర్తవుతుంది," అన్నారు కె. వి. నందనరావు. ఈయన దర్శకత్వం వెలువడే పై సంస్థ చిత్రానికి దాసరి నారాయణరావు కథ, స్క్రీన్‌ప్లే, మాటలు రాస్తున్నారు. మురళీమోహన్, రాధిక నాయకా నాయికలు. జి. యుగంధర్ నిర్మాత.

### ప్రేమకు అంతం ఏది ?

శ్రీ అమ్మన్ ఆర్ట్స్ క్రియేషన్స్‌వారి "అర్థాలు వేయి" చిత్రం పేరును "ప్రేమకు అంతం ఏది ?"గా మార్చినట్లు దర్శక నిర్మాత ఎస్. ఎ. రాజకన్ను తెలియజేశారు. కొత్త నాయికా నాయకులతోపాటు రమణమూర్తి, నాగేంద్ర, మల్లాది, ధన్, జయవిజయ పాల్గొన్న సన్నివేశాలను సెప్టెంబర్ మొదటి వారంలో చిత్రీకరించడంతో షూటింగ్ ఘట్టం ముగిసిందట. నేతాజీ కథకుడు. సంధ్యాల సంభాషణలకర్త. శంకర్ గణేశ్ సంగీత దర్శకులు.

## హిందీ చిత్ర విచిత్రాలు!

★ చిత్రాలకు కొండవీటి చేంతాడంత పేర్లు పెట్టాలంటే డైరెక్టర్ సయీద్ మిర్జాకు అదో ఆనందం. ఆయన తీసిన ఒక చిత్రం పేరు "అరవింద్ దేశాయ్‌కి అజీబ్ దాస్తాన్". మరో చిత్రం "అల్బర్ట్ పింటోకో గుస్సా క్యోం ఆతా హై". త్వరలో సెట్స్‌కు వెళ్లే చిత్రం పేరు "మిస్టర్ అండ్ మిసెస్ జోషి ఇన్‌సాఫ్ కేలియే అదాలత్ మే జాతే హై".

★ ఇదివరకటి రాజస్థాన్ ప్రభుత్వం "క్రాంతి, అబ్దుల్లా, బిన్ మాకే బచ్చే" చిత్రాలమీద వినోదపు పన్ను రద్దు చేసింది. కొత్త ప్రభుత్వం ఆ రద్దును తొలగించేసింది.

★ పద్మాలయా ఫిలిమ్స్ "మేరీ ఆవాజ్ సునో," ఎస్. ఎస్. మూవిటోన్ వారి "దేశ్ ప్రేమీ" చిత్రాలలో హేమమాలిని గర్భవతిగా కనిపించే సన్నివేశాలు కొన్ని ఉన్నాయి. ఆ సన్నివేశాలలో త్వరలోనే తల్లి కాబోతున్న ఆమె అతి సహజంగా నటించగలిగింది.

★ ఆ మధ్య రెండు మూడు చిత్రాల షూటింగ్‌ల నిమిత్తం అమితాబ్‌బచ్చన్ నెలరోజులపాటు కాశ్మీర్‌లో ఉండిపోవలసి వచ్చింది. అప్పుడొకసారి హేర్ కట్ చేసుకోడానికి బొంబాయి తాజ్ హోటల్‌లోని హేర్ డ్రెస్సర్‌ను విమానంలో శ్రీనగర్‌కు పిలిపించవలసి వచ్చింది. అందుకు అయిదువేల రూపాయల వరకు ఖర్చయిందట.

★ హిందీ "రామలక్ష్మణులు" చిత్రం కోసం ఆశాభోంస్లే ఒకేరోజు మూడు పాటలు పాడింది. ఇలా ఆమె మూడు పాటలు ఒకేరోజు పాడడం ఇదే తొలిసారి.

★ "షాన్, సాజన్‌కి సహేలీ, ప్రొఫెసర్ ప్యారేలాల్" చిత్రాల విడుదలకు ముందు రోజున ఆ చిత్రాల నిర్మాతలు జి. పి. సిప్పీ, పవన్‌కుమార్, టి. ఎం. బిహారీల కార్యాలయాలపై ఆదాయపు పన్ను శాఖవారు దాడులు జరిపారట.

★ "పుత్లిబాయ్"లో జయమాల, "డాకూ, చంబల్ కా రాణి" చిత్రాలలో బిందు దోపిడీ ముఠా నాయికలుగా నటించారు. ఇప్పుడు "చంబల్ కి నాగిన్"లో దోపిడీముఠా నాయికగా కమ్లి అనే సినలైన దోపిడీముఠా నాయిక నటిస్తోంది. ఒకప్పుడు ఈమె పేరు వింటే మధ్యప్రదేశ్‌లోని మొరెనా ప్రాంతంలో అందరూ హడలిపోయేవారు.

★ నటుడు, రచయిత, దర్శకుడు, నిర్మాత మనోజ్‌కుమార్ "పెయింటర్ బాబు"తోపాటు "క్లర్క్" అనే ఎన్. జి. ఓ. గాథను తెరకెక్కించబోతున్నాడు.

★ రాజ్‌కపూర్ రష్యాలో ఎంత ప్రసిద్ధుడంటే – ఇటీవల వీసా లేకుండా మాస్కోలో ప్రవేశించగలిగాడు.

★ దేవ్ ఆనంద్ తన "స్వామి దాదా" చిత్రంలో ఒక పాత్రకు మిథున్ చక్రవర్తిని బుక్ చేయబోతే, "మీ యూనిట్‌లో పనిచేసే అవకాశం లభించడమే మహాభాగ్యం. నేను పారితోషికం పుచ్చుకోకుండా నటిస్తాను," అన్నాడట. మిథున్ సద్బ్రాహ్మణుడు. స్నానం చేశాక కారులో స్టూడియో చేరుకునేవరకు గాయత్రీ జపం చేస్తూంటాడట.

★ "పతి పత్ని ఔర్ ఓ" చిత్రంలో నటించిన సంజీవ్‌కుమార్‌కు, "ఇన్‌సాఫ్ కా తరాజు"లో నటించిన జీనత్ అమన్‌కు పారితోషికాలే కాకుండా ఆయా చిత్రాల రాబడిలో కొంత శాతాన్ని కూడా దర్శక నిర్మాత బి. ఆర్. చోప్రా కేటాయించాడట.



'డబ్బు! డబ్బు! డబ్బు!'లో రాధిక

### శ్రీ శ్రీ సమర్పించే "మహాప్రస్థానం"

మాదాల రంగారావు సారథ్యంలో నవంబర్ మాసంలో హైదరాబాద్ పరిసర ప్రాంతాలలో షూటింగ్ ప్రారంభమయ్యే నవీన్ ఆర్ట్స్ పిక్చర్స్ "మహాప్రస్థానం" చిత్రానికి శ్రీ శ్రీ మాటలు, పాటలు సమకూర్చి సమర్పిస్తారు. సెప్టెంబర్ 11న "శక్తికోసమే పదు... ముక్తికోసమే నిలు... విముక్తి కోసమే పదు... నడూ నడూ భయం గియం విడూ విడూ" అనే గీతం చక్రవర్తి సంగీతంలో రికార్డయింది. ఈ గీతం మాదాల రంగారావుపై చిత్రీకరింపబడుతుందని దర్శక నిర్మాత కె. హేమాంబరధరరావు తెలియజేశారు. ఈ చిత్రానికి తోటకూర ఆశాలత కథ రాశారు. ఆర్. రామారావు ఛాయాగ్రాహకుడు.

### జి. ఆర్. పి ఆర్ట్స్

"సంపూర్ణ హాస్య ప్రధాన చిత్రం," అన్నారు కట్టా సుబ్బారావు. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో ఎన్. టి. ఆర్. తొలిసారిగా నటించే చిత్రంలో శ్రీదేవి, నూతన్‌ప్రసాద్, రావు గోపాలరావు, అల్లు రామలింగయ్య ముఖ్య భూమికలు నిర్వహిస్తారు. తొలి గీతం అక్టోబర్ 3న రికార్డవుతుంది. డి. వి. నరసరాజు రచయిత. రాజన్ – నాగేంద్ర సంగీత దర్శకులు. "నవంబర్, డిసెంబర్ నెలల్లో 11 నుంచి 20 వరకు, జనవరిలో 11వ తేదీ నుంచి 30వ తేదీ వరకు జరిగే షెడ్యూల్స్‌తో షూటింగ్ పూర్తవుతుంది," అన్నారు నిర్మాత

# వేసం కాలం వెళ్ళిపోయిన తర్వాత ప్రిక్లీ హీట్ పౌడర్ యిక ఎవరికి కావాలని?



## బాబుకు కావాలి

వేసవికాలం అయితే వెళ్ళి పోయిందిగాని, వేడి మాత్రం తగ్గదు మరి. పిల్లలిక పిల్లలేగదా...వాళ్ళ పద్ధతి మారదుగదా...రోజంతా ఎడతెరపి లేకుండా చలాకీగా ఉంటారిక. మరి వంటిపైన ఆ చికాకునుంచి తప్పించుకుని, భద్రంగా ఉండటానికి, సేద తీర్చేలా, సౌకర్యాన్నిచ్చే ఒక ప్రత్యేకత గల పౌడర్ అవసరం. జాన్సన్స్* ప్రిక్లీ హీట్ పౌడర్‌లో ఏటి పొడుగునా సేదతీర్చేలాంటి సౌకర్యాన్నిచ్చే ఔషధీకరణమైన సూత్రీకరణ ఉంది. అది, క్రిములు దరి చేరకుండా నిరోధించి. చెమటను పీల్చుకుంటుంది. మిమ్మల్ని కులాసాగా ఉంచుతుంది, చలాకీవుండే రోజంతటినీ.

అందుకే, మామూలు టాల్కులు వాడటం కన్నా జాన్సన్స్* ప్రిక్లీ హీట్ పౌడర్ వాడటమే మేలనిపిస్తుంది నిజానికి — ఏడాదంతా, ప్రతి రోజూను.

నేడే కొనండి ఒక ప్యాక్.




## జాన్సన్స్*
## ప్రిక్లీ హీట్ పౌడర్

మీకు సౌకర్యాన్ని ఇవ్వడం కోసం, ప్రత్యేకంగా సూత్రీకరించబడినది

Johnson & Johnson*

OBM-6961 TL

సీరియల్

# నర్సింగ్‌హోం

## శ్రీరంగం

(గత సంచిక తరువాయి)

రామచంద్రుడు పేషంట్ల సంఖ్య నానాటికి పెరుగుతూంది. అతని ఆస్త్మాక్యూర్ అడ్వర్టయిజ్‌మెంట్లు అన్ని పత్రికలలో రాసాగేయి అతని దగ్గర బాగయిన కేసులు, తామెరిగిన ఆస్త్మా వాళ్లనెందరినో పంపిస్తున్నారు. మూడ్నెలల్లో, అక్కడికి జనం తండోపతండాలుగా రాసాగేరు.

జనం ఎక్కువవుతూన్నకొద్దీ అతని చికిత్సా విధానంలో మార్పు రాసాగింది. అతనిలో భయం కూడా ఎక్కువకాజొచ్చింది. తనిచ్చే మందు ఎవరికైనా తెలిసిపోతేనో? ఈ కాలంలో ఏ మందునయినా లేబొరేటరీస్‌లో ఎనలైజ్ చేసి అందులో ఏం ఉన్నాయో తెలుసుకోవచ్చు. తను యిచ్చే నాలుగు రోజుల మందూ, ఎవరైనా తెలివైనవాడు ఎనాలిసిస్‌కి పంపిస్తే, అప్పుడు తనకు కాంపిటీషనుగా మరొకళ్లు తయారవుతారు. అందుకే తను చాలా జాగ్రత్తగా ఉండాలి. అసలు సీసాలో పోసి యివ్వనే వద్దు. తనే పేషంట్ల నోట్లో పోసి వాళ్లు గుటక వేసేదాకా వుండాలి. అందుకే అతను తన యింటికి కొద్ది దూరంలో ఉన్న వొక అయిదు ఎకరాల పొలం కొని అందులో వంద గుడెసెలు వేయించేసేడు. తనదగ్గరకు వచ్చిన ప్రతీవాడూ నాలుగు రోజులు తప్పనిసరిగా అక్కడే ఉంటేనేగాని చికిత్స జరుగదు అని గట్టిగా పట్టుబట్టేడు. పేషంట్లకు అక్కడే ఉండిపోవడం తప్పనిసరి అయింది వాళ్లు ఉన్నందుకు గాను అనవంగా గుడిసె అనబడే ఆ గదికి అయిదు రూపాయలు రోజుకి వాళ్లు చెల్లించాలి. కార్లమీదా, టాక్సీలమీదా, బళ్లలో జనం వచ్చి ఉండిపోసాగేరు

ఈ జనాన్ని చూసి అక్కడ హోటళ్లూ, కిళ్లీకొట్టులూ ఎన్నో ఎద్దాయి. రామచందురుడు రోజూ ప్రొద్దున్నే సీసా చెంచా తీసుకుని ప్రతీ పేషంటు దగ్గరికి వెళ్లేవాడు. చెంచాతో చెంచాడు మందు పోసి వాళ్లు గుటకేసేదాకా ఉండి తర్వాత పేషంటు దగ్గరికి అప్పుడుగాని కదిలేవాడు కాదు.

అతను వాడే మూలికలు ఏంటో అతని కొడుకులకు కూడా తెలియకుండా ఉండేంతగా అతను కట్టుదిట్టం చేసేడు. రోజూ సైకిలుమీద అడవిలోకి వెళ్లి అక్కడ మూలికలను పోగుచేసి, అక్కడే దంపి ముద్దగా తెచ్చేవాడు యింటికి. ఇంత పకడ్బందీగా ఉంచుతూన్నాడు కాబట్టే అతనికి తప్పితే మరెవ్వరికీ తెలియదు ఆ మందేమిటో.

అలా తెచ్చిన ముద్దను యింట్లో తనే స్వయంగా దగ్గర ఉండి కషాయం తీసి సీసాలలోకి ఎత్తించి, ఆ సీసాలను భద్రంగా అల్మారాలో ఉంచి రెండు తాళాలను వేసేవాడు.

తర్వాత కుండలన్నీ సర్దువేసి కడిగించి కొట్లో పడేయించి తాళం వేసేవాడు తర్వాత అల్మారాలోని సీసాలను తీసి పేషంటు తర్వాత పేషంటు దగ్గరకెళ్లి మందు పట్టేవాడు.

రోజురోజుకీ రామచందురుడు ఆర్జన చూసి అందరూ ముక్కున వేలు వేసుకోసాగేరు. రెండో నెలలో అతనికి యిరవై వేలు వొచ్చింది. మూడో నెలలో ముప్పై వేలు దాటింది. అతని యింటి ముందు ఉండే కార్లూ, హడావిడీ, ఆ అట్టహాసం చూసి అతని కూతుళ్లకు మంచి మంచి సంబంధాలు రాసాగేయి.

ఇప్పుడు రామచంద్రుడు పెళ్లికొడుకులను గురించి వెతకటంలేదు. పెళ్లికొడుకుల తల్లిదండ్రులే అతని చుట్టూ తిరుగుతున్నారు.

వొకప్పుడు సైకిలుమీద పల్లెపల్లెకూ రోజూ వెళ్లే రామచందురుడు, యీరోజు యింట్లోంచి కదలాలంటే, టాక్సీయో, కారో లేకుండా కదలడు.

అతని దగ్గరకు వచ్చేవాళ్లే కాకుండా అతన్ని తీసుకువెళ్లేవాళ్లు కూడా తయారయేరు. పేషంటు రాలేని పరిస్థితిలో ఉండి, అతనే రావలసివస్తే, అతను అయిదు వొందలు తీసుకుంటున్నాడు.

జీవితంలో వేలకువేలూ ఖర్చుపెట్టే ఆస్త్మా రోగులకు అయిదు వందలంటే, అయిదు అణాలతో సమానం. సంతోషంతో అతని ఫీజు యిచ్చి అతని కాళ్లకు దండం పెట్టేవాళ్లుకూడా.

పేషంట్లు మరీ పెరుగుతూన్నకొద్దీ అతను ఎవరికీ తెలియకుండా తనొక్కడే మూలికలను దంపలేకపోతున్నాడు. అందుకే అతను మూలికలను దంపే మిషను తెప్పించేడు. తను సంచుల్లో తెచ్చిన మూలికలను గది తలుపులు వేసి దంపి, తలుపులు తీసి కషాయం కొడుకులచేత కాయించేవాడు.

ఇప్పుడు రామచందురుడుకి యింట్లో వి. ఐ. పీ మర్యాద. జీవితంలో అతడు ఎన్నడూ పొందని పరిచర్యలు పొందుతున్నాడు యిప్పుడు యింటి వాళ్ళతో.

* * *

డాక్టర్ రాధాకృష్ణ మానసికంగా చాలా చిక్కిపోయేడు అయిదు రోజులనించీ. అతని భార్య సుగుణ బెడ్‌మీదే పడుకుని ఉంది స్పృహలేకుండా. అప్పుడప్పుడు తెలివిలోకి వచ్చినప్పుడు రాధాకృష్ణ

**జరిగిన కథ — 13:** డాక్టర్ రాజా ఎం. డి. లో గోల్డ్‌మెడల్ సంపాయించుకొంటాడు. ఇప్పుడు అతను తన కుటుంబాన్ని మోయవలసి వున్నది. రాజా, మంజుల ఇరువురూ ఒకరి నొకరు పరస్పరం ప్రేమించుకొంటారు. అతను ప్రాక్టీసుపెట్టి, కొంత ఆర్థికస్తోమత చిక్కిన తరువాత పెళ్లిచేసుకోవాలని నిర్ణయించుకొంటారు. డా. విశ్వం సహాయంతో ప్రాక్టీసు పెడతాడు రాజా. ఎం.బి.బి.యస్. పూర్తి కాకుండానే కొంత డబ్బు ఖర్చుపెట్టి ఆర్. ఎం. పి. డిగ్రీ తీసుకొని డిస్పెన్సరీ తెరుస్తాడు డా. రాధాకృష్ణ. అతను తన భార్య సుగుణకు కూడా ఓ. ఆర్. ఎం. పి. డిగ్రీ సంపాయించి ఆమెను తన డిస్పెన్సరీలోనే లేడీడాక్టర్‌గా వేసుకొంటాడు. డాక్టర్ విశ్వం దగ్గరకు ఓ అమ్మాయి వచ్చి, మీరు లోగడ నా భర్తకు చేసిన 'వేసక్టమీ' ఆపరేషన్ ఫెయిల్ అయిందని అతనితో చెప్పమని, ఫీజు క్రింద తన గాజులు తీసి యిస్తుండగా, విశ్వానికి అహం అడ్డురాగా బయటకు పొమ్మంటాడు. ఆమె పోతుండగా భర్త పేరు అడిగి తెలుసుకొని ఆమెకు సహాయం చేస్తాడు. డా. రాధాకృష్ణ ఎక్స్‌కౌన్సిలర్ సహాయంతో ఓ మందులషాపు పెట్టి, అందులో చదువూ సంధ్యా లేకుండా తిరుగుతున్న తన తమ్ములకు దొంగ సర్టిఫికేట్‌లు సంపాయించి వాళ్లను అందులో వుంచుతాడు. డా. విశ్వం నర్సింగ్‌హోం మేనేజర్ జబ్బుచేసి వెళ్ళిపోతే, అతను వచ్చేవరకు ఆ సీటు డాక్టర్ రాజాకు అప్పగించుతాడు విశ్వం. అస్తవ్యస్తంగా వున్న ఆ నర్సింగ్‌హోంను చూసి, దానిని ఓ దారికి తేవాలని ప్రయత్నిస్తుంటాడు రాజా. ఆసుపత్రిలో తన పని అయిపోయింతర్వాత డా. విశ్వం నర్సింగ్‌హోంలో అతనికి అసిస్టెంట్‌గా పని చేస్తుంటాడు డా. శేఖర్. వళ్లు కాలిపోయిన విశ్వం స్టూడెంట్ డా. ఉమను అతని నర్సింగ్‌హోంలో చేరుస్తారు ఆమె అత్తలు. ఉమ కోర్కెపై ఆమెకు ఏ విధమైన ట్రీట్‌మెంట్ చేయకుండా ఆమె భర్త వచ్చేవరకూ ఉంచుతారు విశ్వం, శేఖర్. అతను వచ్చిన తర్వాత ఆ భార్యాభర్తలిరువురు కన్నుమూస్తారు. రాధాకృష్ణ తనకు అలక్ష్యం చేస్తున్నాడని రమేష్‌ని ఆశ్రయించాలని చూసిన ఎక్స్‌కౌన్సిలర్‌ని అతను బయటికి గెంటుతాడు. ఉమ చావు రాజా, శేఖర్, విశ్వం మనస్సులలో చెరగని ముద్ర వేస్తుంది. ఇంజనీరు చదువుతున్న డా. విశ్వం ఒక్కగానొక్క కొడుకు నీటి ప్రమాదంలో చనిపోతాడు. విశ్వం దంపతులకు మనశ్శాంతి కోసం వారిని ఆయన తమ్ముల దగ్గరికి పంపుతారు రాజా, శేఖర్. డా. విశ్వం నర్సింగ్‌హోంలో ఎటెండర్ సీను రాత్రిళ్లు జరుపుతున్న అక్రమ వ్యాపారాన్ని రహస్యంగా కనుగొని దాన్ని రూపుమాపుతాడు డా. రాజా. తను పెట్టుబడిపెట్టి ఎక్స్‌కౌన్సిలర్‌తో వడ్డీ వ్యాపారం చేయిస్తుంటాడు రాధాకృష్ణ. డా. రమేష్ వూరు విడిచి పారిపోయేటట్లు చేస్తారు రాధాకృష్ణ, ఎక్స్‌కౌన్సిలర్లు. ఆడపిల్లల పెళ్లి విషయం తండ్రి ప్రస్తావించగా తన అశక్తత తెలియజేస్తాడు రాజా. తనకు చిన్నతనంలో ఓ యోగి ఉబ్బసం నయం అవడానికి చెప్పిన మూలికను ఉపయోగించుకొని బాగా డబ్బు సంపాదిస్తుంటాడు రాజా తండ్రి రామచందురుడు.

చేతిని తన చేతిలోకి తీసుకునేది. కళ్లవెంబడి నీళ్లు పెట్టుకునేది. తర్వాత కళ్లు మూసుకుని స్పృహ తప్పిపోయేది.

ఆసుపత్రిలో తనకు తెలిసినవాళ్లు ఉంటారనీ, కాన్పు చాలా సులభం అవుతుందని ఆసుపత్రికి తీసుకొచ్చేడు. పెద్ద డాక్టరుకు బోలెడంత ఫీజు ముందరే కానుకల రూపంలో ముట్టచెప్పేడు. అయినా రోజురోజుకీ కేసు చెడిపోతూందేతప్ప — మెరుగు కావటంలేదు. రోజూ వెళ్లి అతను యింటి దగ్గర డాక్టర్ని కలిసేవాడు. 'డోంట్‌వరీ' అనేది ఆమె. ఆ మాటలతో కాస్తంత ధైర్యం వొచ్చేది. కాని సుగుణని చూస్తూంటే, వచ్చిన ధైర్యం పూర్తిగా దిగజారిపోయేది. ఈ రోజు ఎలా గడుస్తుందా అని అతనికి ఉండేది.

అసలు అయిందేంటంటే రాధాకృష్ణ మామూలు డెలివరీ భార్యకు అవుతుందనీ — ఆసుపత్రికి తెచ్చేడు, నొప్పులు రాకపోవడంవల్ల సిజేరియన్ చేయవలసివచ్చింది. సిజేరియన్ చేసిన మర్నాడునించీ సుగుణకు విపరీతంగా చలిజ్వరం రావడం మొదలుపెట్టింది. ప్యూబిస్ పై భాగంలో అర్ధచంద్రాకారంలో గడ్డలాంటిది బయలుదేరింది. ఇతనికి ఆపరేషను చేసిన సర్జన్ నాలుగు రోజులు, చాలా ఎక్కువ డోసెస్ యాంటీబయాటిక్సుమీద ఉంచి, ఆమెకు అర్థం కాకపోతే జనరల్ సర్జను డాక్టర్ చంద్రశేఖర్‌కు రిఫర్ చేసింది. చంద్రశేఖర్ సుగుణను తన వార్డులోకి మార్పించుకుని, యాంటీబయాటిక్సు యివ్వడం మరీ ఉధృతం చేసేడు. సుగుణకు నాభి క్రిందభాగం అంతా పచ్చిపుండులా తయారయింది. ఆ భాగాన్ని ముట్టుకుంటే అపస్మారంలోకూడా మూల్గేది.

రోజురోజుకీ పాలిపోతూ రక్తహీనం అవుతూన్న యీ కేస్‌లో సీసా తర్వాత సీసా రక్తం ఎక్కిస్తూనే ఉన్నాడు, డాక్టర్ చంద్రశేఖర్. మూత్రం పరీక్ష చేసేడు. రక్తం పరీక్ష చేయించేడు. ఏమీ తేలలేదు. అసలు బాసెస్‌కి సాయంత్రం వొచ్చే అవసరం లేకపోయినా సాయంత్రం అతని క్లినిక్ కట్టేసిన తరువాత వొచ్చి చూసివెళ్లేవాడు.

డాక్టర్ చంద్రశేఖర్ యింటికి రోజూ ఖాళీ చేతులతో కాకుండా, ఏదైనా వొక విలువైన వస్తువును తీసికెళ్లేవాడు డాక్టర్ రాధాకృష్ణ. అతను యిచ్చినదాన్ని అందుకుంటూ 'డోంట్‌వరీ షీ విల్ బి ఆల్‌రైట్' అనేవాడే తప్ప 'కేసు ఏంటి సార్' అంటే 'అదే అర్థం కావటంలేదోయ్. అర్థం చేసుకొనేందుకు ప్రయత్నాలన్నీ చేస్తున్నాను. కాని ఏ పరీక్షకూ నిలబడటంలేదు. చాలా పెక్యూలియర్‌గా ఉంది' అనేవాడు.

రోజూ అతను యిచ్చే అదే సమాధానం చూసి నీరు కారిపోతున్నాడు రాధాకృష్ణ. రోజురోజుకీ దిగజారిపోతూన్న భార్య స్థితిని చూడలేకపోతున్నాడు. ఏ రోజు కారోజు 'ఈ రాత్రి గడుస్తుందా' అన్నట్లుండేది అతని భార్య స్థితి. ఆర్.ఎం.పీలూ, అతని పురిక్లబ్ — మెంబర్లూ వొక్కళ్ల తర్వాత మరొకళ్లు సుగుణని చూసి వెళ్లిపోతున్నారు ఎక్స్‌కౌన్సిలర్ చాలా బాధపడుతున్నాడు. రాధాకృష్ణ సరిగ్గా పదిరోజులయింది క్లినిక్‌కి వెళ్లి. మిగిలిన విషయాలు ఏవీ పట్టించుకోవటంలేదు అతని మనస్సులో 'సుగుణ బ్రతికి బయటపడితే చాలు' అని ఉంది.

అలాంటి సమయంలో వొకరోజు విశ్వం నర్సింగ్‌హోంకి ఫోన్‌చేసి డాక్టర్ రాజుకి పరిస్థితి చెప్పి 'ఏం చేయమంటారు సార్ ?' అన్నాడు

'డాక్టర్ శేఖర్‌కి చూపించండి. అతను డయాగ్నసిస్ చేయలేకపోతేమరెవరూ చేయలేరు'

'సార్ అతను ఏ ఆసుపత్రిలో సివిల్ సర్జన్' అన్నాడు.

'అతను సివిల్‌సర్జన్ కాదయ్యా, అసిస్టెంటే! అతను ఇప్పుడు పి.ఎం.ఒ.గా ఆ ఆసుపత్రిలోనే ఉన్నాడు.'

'చూపించీ చూపించీ అసిస్టెంటు కాసార్ అందులోనూ పి.ఎం.వొక.'

'అవును నీకు మేలు జరగాలంటే నేను చెప్పినట్టుచేయి.'

'సరేసార్.'

'ఇంకో సంగతి! డాక్టర్ చంద్రశేఖర్, డాక్టర్ శేఖర్ అంటే మండిపడుతాడు. అతన్ని వార్డులోకి రానీయడు. అతను లేనప్పుడు వచ్చి అతని కేసు చూసేడని తెలిస్తే చాలా బాధపెట్టేస్తాడు శేఖర్‌ని'

'అయితే ఏం చేయమంటారు సార్' అన్నాడు









'నీవు నీ భార్యని డిస్ఛార్జి చేయించి రెండు గంటలకు నర్సింగ్ హోంకి వచ్చేయ్ ఆ టైములో శేఖర్ ఇక్కడే ఉంటాడు.'

'సరేసార్ నేను తప్పకుండా వస్తా, మీరు కాస్త డాక్టర్ శేఖర్‌కి రికమండ్ చేయండి సార్'

'చేస్తానులే అయినా డాక్టర్ శేఖర్‌కి రికమండేషన్ అసలు అవసరమేలేదు. అతను జబ్బునే చూస్తాడు మనిషిని చూడనే చూడడు' అని 'ఇక ఉంటా' అంటూ ఫోనుపెట్టేసేడు రాజా.

రాధాకృష్ణ డిస్ఛార్జి తీసుకూంటూంటే 'కేసుని యిలాంటి స్థితిలో తీసుకెళ్లి ఏం చేస్తావులే కొంచెం మెరుగయింతరువాత ...'

'ఆ ఆశ కనిపించటంలేదు' అని మనస్సులో అనుకుని 'నేను తీసికెళ్లిపోతాను సార్. ఇక్కడ ఉండీ, ఏం చేస్తున్నాం. ఇంజక్షన్లూ, రక్తం ఇంటి దగ్గర కూడా యివ్వొచ్చు కదా సార్.'

'సరే నీ యిష్టం' అని కేష్ షీటుమీద సంతకం పెట్టేసేడు డాక్టర్ చంద్రశేఖర్.

రాధాకృష్ణ ప్రయివేట్ అంబులెన్సు తెప్పించుకుని అందులో భార్య సుగుణని విశ్వం నర్సింగ్‌హోంకి తీసుకెళ్లేడు.

తన గురించే ఎదురు చూస్తున్న రాజా తను కేసు తీసుకురాగానే వొకగదిలో వేయించి డాక్టర్ శేఖర్‌కి పరిచయం చేసేడు. తను ఆసుపత్రికి వెళ్లేరోజుల్లో వాకింగ్ ఎన్‌సైక్లోపీడియా ఆఫ్ సర్జరీ అంటూ వొకతను ఉన్నాడు అని విన్నాడు కాని, ఆ ఎన్‌సైక్లోపీడియా యితను అని అతను చూడలేదు. పొట్టిగా, పీలగా, వొత్తుగా దువ్వుకున్న తలతో, మనిషిని చూసిన వెంటనే మంచిపోయేటట్టు ఉన్న శేఖర్‌కి నమస్కారం చేసేడు.

కేసుని నర్సింగ్‌హోంలో మొదట అడ్మిట్‌చేసి శేఖర్, రాజా గదిలో కూర్చొని చెప్పండి అన్నాడు.

రాధాకృష్ణ మొదటినించీ అయిందంతా చెప్పేడు. శేఖర్ వింటూన్నంతసేపూ అతనిలో అసలు చలనమేలేదు. ఒక శిలలా కదలకుండా చూపు మరల్చకుండా అతనో సమాధిలో ఉన్నట్టు వినసాగేడు రాధాకృష్ణ ముగించగానే శేఖర్ తల పట్టుకుని 'ఎంతపని అయిపోయిందండీ! మీ భార్యకు ఎమర్జెన్సీ ఆపరేషను చేసి యూటిరస్ వోపెన్ చేయాలి. అందులో మాప్ (రక్తాన్ని తుడిచేందుకు ఆపరేషన్లలో వాడేగుడ్డ) యూటిరస్‌లో మరచి



# నర్సింగ్ హోం

పోయేరండీ' అన్నాడు

'అలా అయి ఉండదండీ. చేసిన సర్జన్ చాలా మంచి సర్జనండీ' అన్నాడు రాధాకృష్ణ.

'ఏలాంటి సర్జన్ల చేతిలో అయినా వొక్కోసారి పొరపాటు జరిగిపోతూంటుంది. అయినా ఈ మాప్స్‌గాని, ఇన్‌స్ట్రుమెంట్లుగాని కడుపులో వదిలేస్తే — అది పూర్తిగా సర్జన్ బాధ్యతగాదు — అసిస్టెంట్లూ, నర్సుదీ కూడా. అబ్‌డామిన్ మూసే ముందు నర్సు తను ఆపరేషనుకు వాడినవన్నీ సరిగ్గా ఉన్నాయోలేదో చెప్పే బాధ్యత ఆమెది ఇప్పుడు ఎవరివించి అయింది కాదు అన్నది ప్రసక్తి, జరిగిందేదో జరిగింది. అయిన ఆలస్యం ఎలాగూ అయింది. ఇప్పుడు మనం పేషంటును రక్షించుకోవాలి.'

'సార్ మీరు వొక్కసారి చూసి నిర్ణయించండి సార్'

శేఖర్ అతిమధురంగా నవ్వేడు 'సరే డాక్టర్ నేను ఎందుకు చూడలేదో తెలుసా? మీరు పేషంటు పరిస్థితిని వర్ణిస్తూంటే పేషంటు నా కళ్ల ముందరే ఉన్నట్టు అనిపించింది' అని లేస్తూ 'పదండి' అన్నాడు.

అయిదు నిముషాలు పరీక్షించి 'డాక్టర్ అదే! ఆ మాప్ వొదిలేయడంనించే, సిజేరియన్ తర్వాత యూటిరెస్ ముడుచుకు పోలేకపోయింది. యూటిరస్ పూర్తిగా ముడుచుకోలేదు కాబట్టే ప్యూబిస్‌మీద గడ్డలా కనిపించింది మాప్ లోపల ఉండడంనించి అక్కడ యిన్‌ఫెక్షన్‌వచ్చి జ్వరం తగిలింది. దాన్నించి టాక్సిమియా, దాన్నించి ఏనీమియా, రాధాకృష్ణ మీరు తొందరగా బ్లడ్‌కి అరేంజిచేయండి ఆపరేషన్ చేద్దాం' అని 'డాక్టర్ విశ్వంగారికి కూడా ఒకసారి చూపించండి' అన్నాడు.

డాక్టర్ విశ్వం పరీక్షచేసి, 'చేసిన ఆమె చాలా మంచి సర్జను. మీరు అనే పొరపాటు జరిగి ఉండదేమో అనిపిస్తూంది.'

'మీరు చేసిన సర్జన్‌ని దృష్టిలో పెట్టుకుని పేషంటును చూస్తే, అలా అనిపిస్తుంది. అలా కాకుండా ఎవర్నీ దృష్టిలోపెట్టుకోకుండా పేషంటునే చూస్తే ...'

'సరే డాక్టర్. కాని మీరు వొకటి రెండురోజులు ఆగుతే మొన్ననే సిజేరియన్ అయింది మళ్లీ మీరు యూటరెస్ వొపెన్ చేద్దాం అంటున్నారు.'

'ఇంకా రెండురోజులు ఆగేందుకు టైము లేదు సార్! నౌ ఆర్ నెవర్ అనే స్థితిలో ఉంది సార్ కేసు.''

'మీ యిష్టం డాక్టర్' అన్నాడు విశ్వం

శేఖర్ రాధాకృష్ణతో 'డాక్టర్ కేసు జనరల్ కండీషను ఏమీ బాగోలేదు. ఐ విల్ డూ ఆల్ మై బెస్ట్' అని థియేటర్ రూమ్‌లోకి వెళ్లిపోయేడు డ్రస్ మార్చుకొనేందుకు.

రాధాకృష్ణ ముఖంలో క్షణక్షణం రంగులు మారిపోతున్నాయి. 'సింపుల్ సిజేరియన్ డబ్బు తీసుకుని కూడ ఎంత కాంప్లికేట్ చేసేరు అబ్‌స్టెట్రిక్ సర్జన్ పొరపాటు చేసినా, డాక్టర్ చంద్రశేఖర్ మీరూ ఆరురోజులు 'డోంట్‌వరీ' అంటూ కేసు యింకా చెడగొట్టేరు'

అతని గుండె మండుతూంది రాధాకృష్ణలో సున్నితత్వం అంటూ తెగిపోయింది

'డాక్టర్స్ నా సుగుణ క్షేమంగాగాని తిరిగి నా ఇంటికి చేరకపోతే . మిమ్మల్ని భగవంతుడు కూడా రక్షించలేడు' అనుకుని సిజేరియన్ చేసిన సర్జన్‌కి ఫోనుచేసి 'డాక్టర్ శాంతా! మీ మీద అమితం అయిన నమ్మకం ఉంచుకున్నాను ఏం తక్కువా చేయలేదు అయినా నా భార్య ప్రాణం తీసే పొరపాటు చేసేరు ఇప్పుడు ఆమె డాక్టర్ విశ్వం నర్సింగ్‌హోంలో ఉంది. డాక్టర్ శేఖర్, మీరు మాప్ యూటిరస్‌లో వదిలేసేరు అంటున్నారు. ఇంకో అరగంటలో ఆపరేట్ చేస్తున్నారు. డాక్టర్ ఆమెగాని బ్రతక్కపోయిందా .. దేవుడు కూడా మిమ్మల్ని రక్షించలేడు' అంటూ ఫోను పెట్టేసి డాక్టర్ చంద్రశేఖర్‌కి ఫోను చేసేడు.

'నేను రాధాకృష్ణను మాట్లాడుతున్నాను ఆరురోజులు మీరు కేసు మీ దగ్గర ఉంచుకుని అదేంటో తెలుసుకోలేకపోయేరు మీరు సరిగ్గా టైముకి డయాగ్నొసిస్ చేసి ఉంటే నా భార్య ఈరోజు చావుబ్రతుకుల మధ్య ఉండేది కాదు డాక్టర్. మీకు మీ సబ్జక్టు తెలుసో, తెలియదో కూడా తెలియదు మీ అలక్ష్యం, అజ్ఞానం నించి నా భార్య ఈరోజు ఇలా అయింది డాక్టర్ చంద్రశేఖర్ నా భార్య విశ్వం నర్సింగ్‌హోంలో ఉంది డాక్టర్ శేఖర్ ఆపరేట్ చేస్తున్నారు — ఇంకో అరగంటలో మీకు ఎంతో డబ్బు ఉండొచ్చు

సుందరాంగుల
సుందరస్వప్నాలకు
సౌందర్యరూపకల్పన -



# రాజ్‌కమల్

చీరలు

అన్ని ముఖ్య షోరూంలలో
లభించును




# RAJKAMAL

మాన్యుఫాక్చరర్స్

శ్రీ సీతారాం డైయింగ్ అండ్
ప్రింటింగ్ మిల్స్,
ప్రై. లిమిటెడ్, బొంబాయి-2




BREEZE







పలుకుబడీ ఉండొచ్చు. ఏది ఉన్నా ... డాక్టర్ నా భార్య ఈ ఆపరేషన్ నించి బ్రతక్కపోయిందా ... మిమ్మల్ని విడవను ... మిమ్మల్ని విడవను' ఫోను రాధాకృష్ణ చేతినుండి జారిపోయింది. అతని గొంతుకలో మింగుడు పడని దుఃఖం మిగిలిపోయింది. కుర్చీమీద చేతులు ఉంచి తల వాటిమీద పెట్టుకున్నాడు.

అతన్ని దూరంనించే చూస్తున్న రాజా అతని దగ్గరకు వచ్చి రాధాకృష్ణ భుజంమీద చేయివేసి – 'డాక్టర్ ఆవేశపడకండి' అన్నాడు.

రాధాకృష్ణ తలఎత్తి రాజా చేతిని తనచేతిలోకి తీసుకుంటూ 'డాక్టర్ నా భార్య బ్రతుకుతుందా' అన్నాడు.

'చేసేవాడు డాక్టర్ శేఖర్ ... అంతకంటే గొప్ప సర్జన్ మీకు దొరకదు. తర్వాత సంగతి దైవాధీనం.'

ఆపరేషన్ అయిదు నిముషాల్లో మొదలు పెడ్తారు అనగా డాక్టర్ శాంతా, డాక్టర్ చంద్రశేఖర్ ఇద్దరూ కార్లలో వచ్చేసేరు. థియేటర్ అవతల కుర్చీలో కూర్చున్న రాధాకృష్ణ భుజం యిద్దరూ తట్టి 'ఎవ్విరిథింగ్ విల్ బి వోకే' అంటూ లోనికి వెళ్లేరు.

డాక్టర్ శేఖర్ వాళ్లని విష్‌చేసి ఆపరేషన్ మొదలుపెట్టేడు. ఆరోజు డాక్టర్ చంద్రశేఖర్, డాక్టర్ శాంత అటువంటి సర్జరీ మొదటిరోజు చూసేరు వాళ్ల జీవితంలో. ఆస్కాల్‌పల్‌తో డాక్టర్ శేఖర్ ఆడేవిధం – కోస్తున్నట్టు గాకుండా నృత్యం చేస్తున్నట్టు కనబడసాగింది. ఆ ఫైనర్ మూమెంట్సు కళాకారుని కుంచలేతప్ప – సర్జన్ స్కాల్‌పల్‌కు వాళ్లు చూడలేదు. రక్తం మహా తక్కువతో, అతను చేస్తున్న భాగం అద్దంలా తళతళ మెరుస్తూండగా అతను యూటరిస్ తెరిచి అందులోంచి క్రికెట్‌బాల్ అంత మాస్ బయటికి తీసి, యూటరిస్ శుభ్రం చేసి కుట్టేసేడు. స్కాల్‌పల్ అతను చేతిలో పట్టుకున్నప్పటినించి – పదిహేను నిముషాల్లో ఆపరేషను పూర్తయింది.

డాక్టర్ శాంతగాని, డాక్టర్ చంద్రశేఖర్‌గాని అంత తొందరగా వాళ్ల ఎరికలో ఎవరూ ఆపరేషను పూర్తిచేయలేదు.

తన డయాగ్నాసిస్ రైట్ అయిందని అందరూ

# నర్సింగ్ హోం

మెచ్చుకున్నా శేఖర్ మొఖంలో కొంచెం అయినా మార్పురాలేదు.

పిండేసిన బట్టలా ఉన్న రాధాకృష్ణ దగ్గరికి వచ్చి అతని భుజంమీద చేయివేసి 'సారీ డాక్టర్ ఆయ్‌వాజ్ రైట్' అంటూ వెళ్లిపోయాడు.

ఆరోజునించీ డాక్టర్ శాంతా, డాక్టర్ చంద్రశేఖర్ యిద్దరూ రోజుకు మూడుసార్లు వచ్చి కేసును పలకరించిపోతున్నారు. ఆపరేషను అయినప్పటినించీ సుగుణ జ్వరం తగ్గి, ఆమె యింత తిండి తినేదాకా శాంతా, చంద్రశేఖర్ చాలా మానసిక వ్యధకు లోనయేరు.

శుభ్రంగా సుగుణ కుట్లు తీసినరోజు సాయంత్రం డాక్టర్ శేఖర్‌కి ఫోన్‌కాల్ వచ్చింది.

శేఖర్ దాన్ని అందుకుని 'హలో' అన్నాడు.

'నేను డాక్టర్ చంద్రశేఖర్ని, డాక్టర్ మీరు టైంలీ డయగ్నాసిస్ చేసి సుగుణని రక్షించినందుకు థాంక్స్. డాక్టర్ మీరు నా అసిస్టెంటుగా ఉన్నప్పుడు మిమ్మల్ని చాలా బాధపెట్టేను, నన్ను క్షమించండి' అని 'డాక్టర్ యివాళ హెల్త్ మినిష్టర్‌తో మిమ్మల్ని నా యూనిట్‌కి నా అసిస్టెంటుగా ట్రాన్స్‌ఫర్ చేయమని చెప్దాం అనుకుంటున్నాను, పర్మిషను యిస్తారా.'

'వద్దు సార్ నేను యింకా నెలరోజుల్లో సూపర్ ఎంయస్‌కి వెళ్లిపోతున్నాను. వొక నెల గురించి వొద్దు సార్' అన్నాడు.

'సరే డాక్టర్ మీకు ఎప్పుడు ఏం అవసరం ఉన్నా వొక్క ఫోన్‌చేయండి' అని ఫోన్ పెట్టేసేడు.

* * *

రామచందురుడు కూతుళ్ల పెళ్లి ప్రయత్నాలు చాల సందడిగా సాగిపోతున్నాయ్. అతని ధనం పెరుగుతూన్నకొద్దీ, అతని బలగం కూడా పెరుగజొచ్చింది. వచ్చినవాళ్లను వెళ్లు అని చెప్పకుండా ఆదరిస్తున్నాడు. పెళ్లియింకా వారంరోజులే ఉంది. కూతుళ్లకు మంచి సంబంధాలే తెచ్చేడు. ఒక్కో కూతురు మీదా యాభైవేలదాకా ఖర్చుపెట్టేందుకు సిద్ధం అయేడు. ఇంట్లో పెళ్లిళ్లకు కావలసిన వడియాలూ, అప్పడాలూ, ఆవకాయలూ ఘనంగా తయారుచేస్తున్నారు. అతని ప్రాక్టీసు రోజురోజుకీ పైపైకి పోతూంది.

రాజా తండ్రిని చూసి వెళ్లినప్పటినించీ వొక్కసారీ రాలేదు. అతనికి అక్కడికి వెళ్లడానికి సిగ్గు అడ్డవస్తూంది. ప్రతినెలా టంచనుగా వెయ్యి రూపాయలు మనియార్డరు మాత్రం చేస్తున్నాడు. అతను చాలా ప్రయత్నాలు చేస్తున్నాడు కనీసం వొక యాభైవేలయినా అప్పుట్టించేందుకు అవన్నీ ఫలించకపోతే ఆఖరికి డాక్టర్ విశ్వాన్నే అడగాలి అనుకున్నాడు. అతని ప్రయత్నాలు ఎక్కడా ఫలించటంలేదు. అతని మనస్సు ఆందోళనతో నిండిపోతూంది. తన బాధనంతా వెళ్లగక్కుతూ మూడురోజుల క్రిందటే తండ్రికి, "ఇంకోసారి తిరిగి ప్రయత్నించి, అదీ ఫలించకపోతే ఇక డాక్టరు విశ్వాన్నే అడుగుతాను. అతను నా మాటను కాదనడు అనే నమ్మకం నాకుంది" అని ఉత్తరం రాసేడు.

ఉత్తరమైతే రాసేడుగాని డాక్టర్ విశ్వాన్ని అంత పెద్ద మొత్తం ఎలా అడగాలో తోచటంలేదు తను అడిగితే కాదనడు అన్న నమ్మకం ఉంది. కొద్ది నెలల పరిచయంతో అంత డబ్బు ఎలా అడగగలడు అతన్ని అడుగుదాం అని నోరుతెరిస్తే, నోరు ఎండుకుపోతూంది, తప్పితే నోటమాట రావడంలేదు.

ఇలాంటి పరిస్థితులలో తండ్రి దగ్గరనించి తన చెల్లెళ్ల పెళ్లి అంటూ శుభలేఖ వచ్చింది దాని వెంబడి 'నీవు డబ్బు గురించి ఏ ప్రయత్నాలూ చేయకు. భగవంతుడి దయవల్ల ఎవ్వర్నీ అడగకుండా, స్వంత కృషిమీదే ఈ వివాహం జరుగుతూంది' అన్న ఉత్తరం కూడా వొచ్చింది.

మొదట ఆ ఉత్తరం చూసి ఆశ్చర్యపోయేడు. తర్వాత ఆనందపడ్డాడు. ఆటు తర్వాత బాధ అనిపించింది తను ఏ విధంగానూ తండ్రికి సహాయం చేయలేకపోయేనే అని.

'తను యిక్కడే ఉండి అన్నీ అనుకొనే దాని కంటె తండ్రి దగ్గరకు వెళ్లి నోరు విడిచి అడగని తండ్రికి తను ఏ సహాయమైనా చేయాలి' అని అనుకుని ఆ రోజే విశ్వంతో తను వొకరోజు ఊరికి వెళ్లివస్తానంటూ బయలుదేరేడు.

అతను పల్లెటూర్లో బస్సుదిగేటప్పటికి, అతనికి ఆశ్చర్యకరమైన మార్పులెన్నో కనిపించేయి అన్నిటికంటె అద్భుత విషయం--అక్కడి సందడి. రోడ్లమీద జనమే కనిపించని తన పల్లెలో యింత మంది ఏంటి ? అన్న ఆసక్తితో యింటికి వెళ్లేడు.

తన యిల్లు ఇల్లుగా లేదు. ప్రజల ఆదరణలో ఉన్న వొక మంచి హోటలులా జనంతో కిటకిట


ఎక్కడ
లైఫ్‌బాయ్
ఉన్నదో అక్కడ
ఆరోగ్యము ఉన్నది
లైఫ్‌బాయ్ సబ్బుతో స్నానం చేస్తే మీకు పరిశుభ్రంగా ఉంటుంది. తాజాగా, హాయిగా వుంటారు. లైఫ్‌బాయ్ వాడకం మీకు ఆరోగ్య ప్రదమైనది. జ్ఞాపకం వుంచుకోండి.
లైఫ్‌బాయ్
మురికిలో గల క్రిములను
కడిగి వేస్తుంది
LIFEBUOY
for health
LIFEBUOY
SOAP

లాడుతూంది. ఇంట్లో ఐశ్వర్యం తెచ్చిన కళలెన్నో కనిపిస్తున్నాయి.

ఇదంతా అర్థం కాని రాజా అలానే నిలబడి పోయేడు.

అతని చెల్లెలు సీత అతని ప్రక్కనించి వెళుతూ అచేతనంగా ఉన్న రాజాని చూసి 'అన్నాయ్' అంటూ అతి సంతోషంతో పలుకరించింది.

ఏ ద్వేషం లేని ఆ ముఖాన్నీ, ఆప్యాయత నిండుకున్న ఆ కంఠాన్నీ రాజా విస్మయంతో చూసేడు.

'ఏంటి అన్నాయ్ అలా నిలబడిపోయేవ్ లోపలికి రా' అంది.

ఇంట్లోకి వెళ్ళేడు. గొంటిల్లంతా సామాన్లతో నిండి ఉంది. వాటిమధ్య మహారాణిలా ఉన్న తల్లిని చూస్తు 'అమ్మా' అన్నాడు.

'వొచ్చేవా రాజా' అంటూ ఆదరంతో పలకరించి పాలు అందించింది తల్లి.

పాలు తాగుతూ 'అమ్మా' అన్నాడు ఏమీ అర్థంకాక.

'ఏంటిరా అలా బెంబేలుగా అలా చూస్తావేంటి ?' అంది తల్లి.

'యివన్నీ...'

'కాలం కలిసిరావాలే కాని యివన్నీ ఏంటి ? యింతకు పదింతలుకూడా కలుసితాయ్.'

'ఏం కాలం ?' అన్నాడు రాజా.

'అవన్నీ తీరుబాటుగా మాట్లాడుకుందాంగాని మీ నాన్నను మొదట కలిసిరా, నీగురించి తెగ ఆరాట పడిపోతున్నారు.'

రాజా లేస్తూంటే అతని తల్లి ఎవరినో కేకేసి 'వొరేయ్ రాజాని నర్సింగ్‌హోం దగ్గరికి తీసుకెళ్ళు' అంది.

'నర్సింగ్‌హోం అంటే'

'సావధానంగా తెలుస్తాయి కాని మొదలు మీ నాన్నను పలకరించు. ఈ కుర్రాడితో వెళ్తే తీసుకెళుతాడు.'

తమ యింటినించి పది నిముషాల నడక.

అక్కడ అందంగా కనిపించే పెంకుటిల్లు ఉన్న గుడిసెలను చూస్తూ 'యిదంతా ఏంటి ?' అనుకుంటూ వెళ్ళేడు.

తండ్రి పదిమంది తను తెలియని మనుష్యుల మధ్య కూర్చుని మహారాజాలా వెలిగిపోతున్నాడు.

తన్ను చూస్తూనే 'రాజా' అంటూ లేచివచ్చి కౌగిలించుకున్నంత పనిచేసి అక్కడున్నవాళ్ళందరితో 'నా కొడుకు రాజా, ఎం. డీ డాక్టరు. సికిందరాబాదులో ప్రాక్టీసు చేస్తున్నాడు' అని 'ఏంటి వారం రోజుల ముందుగా వచ్చేసేవ్. నీకు ఉత్తరం రాసింది నువ్వు అనవసరంగా వీళ్ళనీ వాళ్ళనీ డబ్బు అడిగి శ్రమ పడొద్దనీ! నేను నీ తమ్ముళ్ళనే పంపిద్దాం అనుకున్నాను, కాని వాళ్ళకు యిక్కడ అసలు తీరికే లేదు. నీ ఉత్తరానికు తిరిగి జాబు రాద్దాం అనుకుంటే, యీ పేషంట్లు వొక అయిదు నిముషాలు కూర్చోనిస్తేనా. నీ ఆఖరి ఉత్తరం చూసి ఎక్కడ డాక్టరు విశ్వంగారిని డబ్బు అడిగేస్తావో అన్న భయంతో ఉత్తరం రాయవలసి వొచ్చింది. లేకపోతే పెళ్ళికి ఒక రోజు ముందర నీ తమ్ముణ్ణి నీ దగ్గరికి పంపించి, నిన్ను రమ్మందాం అనుకున్నాను' అని అతనిచుట్టూ ఉన్నవాళ్ళతో 'నేను తర్వాత కలుస్తాను' అన్నాడు.

వాళ్ళు వెళ్ళిపోయేరు.

ఆ గది ఖాళీ అయింది.

'నాన్నా ఇదంతా ఏమిటి ?' అన్నాడు.

'రాజా నీతో అప్పుడప్పుడు అనేవాడ్ని జ్ఞాపకం ఉందా. ఒక స్వాములవారు ఆస్థమా గురించి మూలిక చెప్పేరనీ. అది పనిచేయవు అని అతి తేలికగా కొట్టిపడేసేవాడివి. అది బాగా పనిచేస్తుందనీ నాకు నమ్మకం ఉంది. చాలా కేసుల్లో వాడేను కూడా. నీవ్వు వచ్చి వెళ్ళింతరువాత ఈ ఆడపిల్లల పెళ్ళిళ్ళు ఎలారా ? అన్న దిగులే నా చేత ఆ మందును బయటికి తీయించింది' అంటూ అప్పటినించీ జరిగిన కథంతా చెప్పేడు.

రాజాకి ఆస్థమాకి మందులు ఉన్నాయనీ, అవి తాత్కాలిక ఉపశమనానికేననీ తెలుసు. ఎన్నో అడ్వటయిజ్‌మెంట్లు గ్యారంటీ క్యూర్ అంటాయని తెలుసు. ఆ మందులు సరిగా పనిచేయకపోవడం కూడా తెలుసు. కాని తండ్రి — యింత తక్కువ వ్యవధిలో యింత డబ్బు సంపాదించేడంటే అందులో కస్తయినా నిజం ఉండాలి. లేకపోతే యింత జనం అసంభవం.

'నాన్నా' నాకు నీ పేషంట్లను వొకసారి చూపిస్తావా' అన్నాడు. తండ్రి సంతోషంతో చూడు అంటూ పాకలలోకి తీసుకెళ్ళి చూపించేడు. మందు తాగిన వాళ్ళంతా తన తండ్రిని మెచ్చుకుంటున్నారు. ఆ పేషంట్లలో తన యిద్దరు ఆస్తమా పేషంట్లు కూడా కనిపించేరు. వాళ్ళకు తను మందులు రాసి రాసి విసిగిపోయేడు దీనంగా తన ముందు ఊపిరి అతికష్టంమీద పీల్చుకునే పేషంట్లు, తన్ను చూస్తూనే గుర్తించి 'డాక్టరు గారూ మీ నాన్నగారు బ్రహ్మాండమైన మందు కనిపెట్టేరు సార్! లేకపోతే ఇరవై ఏళ్ళనించి నిముష నిముషం ఎప్పుడు అటాక్ వస్తుందో అని భయంతో చచ్చేమేము—మూడురోజులనించి హాయిగా ఉంటున్నాము' అన్నార.

ఆరోజు రాత్రి తను వెళ్ళినతరువాతే వొచ్చిన ముగ్గురు పేషంట్లకూ, ఆక్సిజన్ యివ్వాల్సినంత తీవ్రమైన కేసులికి అతను వొక్క చెంచాడు మందుతో, అరగంటలో దించేసేడు. తిరిగి గదిలోకి వచ్చింతరువాత 'నాన్నా అదేం మందు ?' అన్నాడు

'అది రహస్యంరా చెప్పకూడదు' అన్నాడు తండ్రి.

'మందుని రహస్యంగా ఉంచితే దాని ఉపయోగాన్ని చంపేసినట్టే' అన్నాడు రాజా

'అవుననుకో! దీని రహస్యం చెబితే ఈ మందు పనికిరాదు. ఎవరికీ చెప్పొద్దు అంటూ ఈ మూలిక యిచ్చిన స్వామి నా చేతిలో చేయివేయించుకొన్నారు.'

''అలా అని యింతమంచి మందునూ, కోట్ల జనానికి అక్కరకు వచ్చే మందును, రోగులకు పనికి రాకుండా ఉంచుతావా ?'' ''దీన్ని వొకసారి ఎవరికేనా చెబితే కోట్లకుకాదు వందలకు కూడా పనికిరాకుండా పోతుంది. ఈ మందు పవరు దీని రహస్యం కాపాడడంలో ఉందిరా ''

'అలా అని నీ నమ్మకం నాన్నా! దీన్ని నీకిచ్చినతను రహస్యం అంటూ ఎందుకు అన్నాడంటే, ఇది మోసగాళ్ళ చేతుల్లో, స్వార్థుల చేతుల్లో పడి నలిగిపోకుండా. అందుకే పూర్వం తమ జ్ఞానాన్ని ఇంకొకరికి పంచిచ్చే మొదట వాళ్ళకు అర్హత ఉందా ? అని పరీక్షించేవారు నాన్నా అది వొకప్పుడు కాని యిప్పుడు కాదు. దీన్ని తీసికెళ్ళి గవర్నమెంటుకు అప్పజెబితే దీనిమీద రిసెర్చి చేసి, యింకా బాగా రూపొందించి, అందరికీ ఉపయోగపడేట్టు చేస్తుంది. బజార్లో పెన్సిలిన్ మందు ఉంది. దాన్ని కనుగొనింది అలెగ్జాండరు ఫ్లెమ్మింగ్ అతను పదిహేనేళ్ళు నిద్రకూ, తిండికీ, సుఖానికీ దూరమై కనుక్కున్నాడు. తను కనుగొన్న మందు తనదగ్గరే ఉంచుకుంటే — యీ రోజు ఎన్నో కోట్ల మంది జబ్బులపాల పడకుండా ఉండేవారా ? అతను ఆ మందును ప్రపంచానికి అందించి కొన్ని కోట్ల కోట్లు చనిపోయేవాళ్ళను బ్రతికించేడు. వీటిలో కావలసింది నిస్వార్థత నాన్నా. స్వార్థంతో అతనే ఉంచుకొని ఉంటే యీ రోజు మనకు పెన్సిలిన్ ఉండేది కాదు.'

'రాజా నీవు చెప్పింది బాగుంది. పెన్సిలిన్ అతని మందు. అందుకే అతను మనస్ఫూర్తిగా ప్రపంచానికి అందీయగలిగేడు. కాని యిది నా మందు కాదు. దీన్ని యింకోళ్ళకిచ్చేందికి నాకు అజ్ఞలేదు' అని 'రా యింట్లోకి పోదాం' అన్నాడు

కొద్దిగా అసంతృప్తిగా ఉన్నా 'పోన్లే యీ పెళ్ళి హడావుడి అయింతరువాత నాన్నకు నచ్చచెబుదాం' అనుకుని తండ్రి వెంబడి నడిచేడు రాజా.

(ఇంకా వుంది)

## చదరంగం ఆడే మరమనిషి !

వివిధ దేశాల్లో మరమనుషులను తయారుచేసి పరిశ్రమల్లో వుపయోగిస్తున్న సంగతి అందరికీ తెలుసు. వీటికి తెలివి తేటలతో పనిలేదు. కేవలం యాంత్రికంగా పనిచేయగలవు. పశ్చిమ జర్మనీలో చదరంగం ఆడగల మరమనిషిని తయారుచేశారు. ఈ అసాధారణమైన మరమనిషి కేవలం ఒక కంప్యూటరు. దీనికొక చేయి కూడా వుంది. ఆ చేతితో నెట్టుబడిన పావులను కూడా తొలగించగలదు. కాస్త నిదానంగా ఎత్తులు వేసేవారిని ఓపికగా భరిస్తుంది. అన్నిటికంటే విశేషం, తొమ్మిది ఎత్తులను ముందుగానే ఆలోచించుకుంటుంది !

( గత సంచిక తరువాయి )

























[ఇంకా ఉంది]

వైశాఖ శుద్ధ తదియ -

భక్తులతో నిండిన ఆలయం. సుమారు పదిగంటలు కావస్తోంది. నారాయణ మనవడి నెత్తుకుని వెంట కోడలితో కప్ప స్తంభం వద్దకొచ్చి ...

''గుర్తున్నానా బాబూ'' అంది.

''ఎవరూ ...'' అంటూ చూశాడు కౌస్తుభం.

''నేను ... డాబాల వాయురాలిని. కింద యేడు దీన్తోవచ్చి మొక్కుకున్నామూ...దీనికి బాబు పుట్టేడు. సిమ్హాద్రి అప్పన్న కప్ప స్తంభం కోరిన వరాలిచ్చేస్తది. దేవుడున్నాడు బాబూ ... వున్నాడు. ఇంద టికెట్టు యివ్వండి'' అంటూ డబ్బులు అందించింది.

భగవంతుడికీ భక్తులకూ మధ్యవున్న నమ్మకం ... ఆత్మశుద్ధి భవిష్యత్తును ప్రకాశవంతం చేస్తుంటే శారీరకమైన మంచి అలవాటులు ఆరోగ్యాన్ని ప్రసాదిస్తున్నాయి.

తన విషయం -

తన కుటుంబ విషయం ఎవరు బాగు చేయగలరు-పదేళ్ళనించీ దేవుడి సేవ చేస్తున్నాడు. వాడికి తనంటే చిన్నచూపే ...

లేకుంటే ... గొప్ప కులంలో పుట్టీ ... ఆచారాలూ ... అనురాగాలూ మంట కలిపి రామకృష్ణ చేసేపనులు...వున్న డబ్బు తగలేసాడంటే పోనీ అనుకోవచ్చు ... తల్లి పట్టు బట్టలు తాకట్టుపెట్టి త్రాగి సానికొంపలెంట తిరుగుతాడా...ఒక్కగానొక్క కొడుకు. వాడు ఎన్నోసార్లు యీ స్తంభాన్ని కావలించుకుని

ఏవైనా కోరుకోనవమ్మనట'' అన్నాడు కౌస్తుభం.

టికెట్టు తీసుకొనగానే నాయకుడు పసుపు వస్త్రం తెచ్చి మణిమాల చేతికి కట్టి కప్ప స్తంభం చుట్టూ ఆ బట్టని కట్టేసాడు.

''అలా కట్టండి ... త్వరలో చెరో బిడ్డనీ ఎత్తుకోవాలి...'' వెనుక వరుసలోంచి వస్తూన్న నలుగురు వెటకారిస్తూ అన్నారు.

తుళ్ళిపడి చూసారు భారతి...మణిమాల కొండమీద బస్సుస్టాండులో ఎలాగో వాళ్ళ

# కప్పస్తంభం



గట్టా వెంకటేశ్వర్లు



ఎంతైనా నమ్మకం ...

చేస్తున్న పనిని విస్మరించి ఓ క్షణం వేదాంతంలో లీనమైపోయాడు కౌస్తుభం.

ఆ వూళ్ళో తనూ ఓ దేవుడు -

పదహారేళ్ళ వయస్సులోనే కఠోరమైన దీక్షలు పూని మంత్రాలు జపించి...అర్థరాత్రీ అపరాత్రీ భేదం లేకుండా పాము కరిచినా ... గాలిపట్టినా ... మానసిక దౌర్బల్యంతో వున్నాదులైనా ఎవరికి తగిన రీతిలో వారికి వైద్యం చేస్తూ ఎన్నో జీవితాలను సంతోషమయం చేశాడు.

కానీ -

మొక్కుకున్నాడు...కాని వాడి రాత మాత్రం మారలేదు. ఒకవేళ వాడు మొక్కుకున్నా అలా త్రాగి తిరగటానికే సహాయపడమని భగవంతుణ్ణి కోరుకుని వుండడని నమ్మకమేమిటి?

అలాఆలోచిస్తూన్న కౌస్తుభాన్నిచూస్తూ రొప్పుతూ యిద్దరమ్మాయిలు నిలుచున్నారు.

''టికెట్టు కావాలా అమ్మా...''అన్నాడు.

''ఈ స్తంభం సంతానం కోసమే పట్టుకుంటారా...'' అంది మణిమాల.

''పూర్వం ఋషులు సంతాన గోపాలస్వామి మంత్రం వేసారట...ఒక్క ధనవాంఛ మిగతా

కళ్ళుకప్పి వచ్చారనుకుంటే యిక్కడికీ తయారయ్యారు.

క్యూలో ఆ నలుగురూ చేస్తున్న గోలకు వలంటీర్లు కలుగజేసుకుని వాళ్ళని వారించారు.

''పూర్ణామార్కెట్టువద్ద బస్సెక్కినప్పటి నించీ యిదే గోల ... కాస్త వాళ్ళకు భయం చెపుతారా...'' అన్నారు అమ్మాయిలు.

''కోవెలలో ఏమీ అనలేరమ్మా ... ఒకవేళ గోల చేసినా సిబ్బంది వూరుకోరు ... బయట యిలాంటి వేషాలువేస్తే పోలీసులకు చెప్పండి ...మిగతావిషయం వాళ్ళే చూసుకుంటారు.'' సలహా యిచ్చాడు అతను.

అన్యమనస్కంగానే దర్శనం చేసి...ప్రసాదం తీసుకుని కళ్యాణమంటపంలోకి వచ్చారు.

"ఏమి శిల్పం భారతీ ... యిదే తొలిసారి నేను సింహాచలాన్ని చూడ్డం..."

"ఇంకా నయం యీనాటికి ఈ మాత్రం గడపదాటి దేవుడి దర్శనానికి వచ్చావంటే విశేషమే..."

"కట్టుబొట్లు...సాంప్రదాయాన్ని కాదని లేం కదే...అది సరేలే...ఆ శిల్పం చూడు... నాగసుందరి యీవిడే కాబోలు...రంభా ... ఊర్వశి ... మేనకలు ... అప్పన్న శిల్పి అహోరాత్రాలూ పడిన శ్రమకు ప్రతిరూపాలు...ఈ సజీవత్వం పుట్టి పడుతున్న శిల్పాలు...ఆనాటి మానవులకు కల్మషంలేని హృదయం వుండ బట్టే కార్యసాధకులు కాగలిగారు."

"హాయ్ ... ధవళ ప్రతిమా ... "

నవ్వుతూ వచ్చి మంటపం మెట్టుమీద కూర్చున్నారు ఆ నలుగురు.

"భారతీ ... పద. మళ్ళీ బస్సులు దొరకవు."

ఇద్దరూ మౌనంగా గోపురం మెట్లుదిగి వచ్చి బజార్లో వున్న బొమ్మలూ ... భజన చేస్తున్న కొండవాళ్ళను చూస్తూ కొద్దిసేపు గడిపి ... వీర్రాజు కొట్లో కుంకుమ, గాజులు కొన్నారు.

"నీకేమంటే యిష్టం .. "

"ఏ విషయంలో ... " అసక్తిగా తిరిగి అంది భారతి.

"ఈ కనిపించే వస్తువులలో ఏమి కావాలి ... " సంపెంగపూలు కొంటూ అంది మణిమాల.

"నాకు అనాస తొనలూ...బాబ్జీకి పనస తొనలూ ... ఆఁ ... నీకురా ... " అన్నాడు నవ్వుతూ ఆనందరావు.

"ధవళ ప్రతిమ ... " అన్నాడు కిషోర్.

వెకిలిగా నవ్వుతూ వస్తున్న ఆ నలుగురినీ గట్టిగా అరచి పదిమందినీ పిలిచి పచ్చడి చేయించాలనిపించింది. కాని అంతలోనే మనస్సు అడ్డం తిరిగి ఆక్రోధం నరుగులాంటి నడకకు దారితీసింది. మణిమాల వెనకనే భారతి తిరిగి తిరిగి చూస్తూ...బస్సు స్టాండుకు వచ్చింది. టిక్కెట్లు తీసుకుని దిగువకెళ్ళే బస్సులో కూర్చున్నారు.

చుట్టూ కొండలు ... ఆ కొండల మధ్య నుంచి ధుమికే జలపాతాలు. పచ్చని ప్రకృతి. పువ్వులు. పేరు తెలీని పువ్వులు. దూరంగా కనబడే పూలతోట. ఆ తోటమీంచి వచ్చే గాలిలోని పవిత్రత, సంపెంగపూల సౌరభం ముక్కుపుటాలకి తగులుతున్నాయి. అందమైన చిత్రకారుడు చిత్రించిన ప్రకృతి దృశ్యంవలె వున్న ఆ వాతావరణాన్ని చూసి తన్మయం పొందింది మణిమాల.

"కప్ప స్తంభం ఆలింగన చేసుకున్నావు యేమని కోరుకున్నావ్" అంది భారతి చెవ్వులో చెప్పినట్లు.

భారతి ప్రశ్నకు ఇహంలోకి వచ్చినట్టు చిన్నగా నవ్వి "చెప్పాలా..." అంది కొంటెగా మణి.

నిజానికి యాంత్రిక జీవితంలోని అసంతృప్తి, నిరాశ తొలగి మరో తెలీని ఆనందం పొందుతోంది మనస్సు. చిన్నప్పటి నుంచీ... ఇల్లు...హైస్కూలు...విశాఖ పరిసరాలు అవీ యేకొద్దో పాంబీచ్ ... ఇందిరా పార్కు ... జగదాంబ జంక్షన్ ...లాసన్స్‌బే...ఆసీలు మెట్ట...ఇలాంటి జన సంచారక ప్రదేశాలు చూసి విసుగెత్తింది.

కానీ —

ఈ యాత్రా స్థలం...యిదీ కిక్కిరిసిన జనంతో వున్నా యీ మనుషుల్లో...వునికిలో ... ప్రకృతిలో ఏదో నిండుతనం...భక్తి భావాలతో పడుతున్న ప్రతి అడుగూ యేదో పవిత్రతను తెలియజేస్తోంది.

"నీలో ఎంత మార్పు...వయస్సు వచ్చింది కదా..."

చెయ్యి గిల్లి కొబ్బరి ముక్క చేతిలో పెట్టింది భారతి.

"ఇంతకీ నీకు సమాధానం కావాలి..." సిగ్గు నభినయిస్తూ మణి.

"పోనీలే భక్తి పారవశ్యంతో వున్నట్టున్నావ్..." పెదాలు బిగించి నవ్వుతూ అంది భారతి.

"ఈ మంచి అలవాటులన్నీ నీ స్నేహం తోనే వచ్చాయి." గౌరవం ... తన్మయత్వం పుట్టిపడింది ఆ మాటలో.

"అబద్ధం మణీ ... ఆ పొగడ్త నాకు కాదు...బండబారిన నీ హృదయానికి తియ్యని స్పందన నేర్పింది మాధవ"

చెవిలో అంది భారతి.

"ష్...నెమ్మది...భారతీ ఆ పేరు పదే పదే గుర్తుచేసి నా మానసాన్ని కలకలం చేస్తున్నావు...అతను వుత్తముడు ... తపస్వి...అతనిలో నా తలపులు లేకున్నా అతని వూహలే నాకు కొండంత ఆశ."

అంటూ వెనక్కి తిరిగింది మణిమాల.

"అదిరా అసలు విషయం ... హైపవర్ ట్రాన్స్‌మీటర్ పెట్టినా ఆ గుండెలోంచి ఈ గుట్టులాగ గలిగేవాళ్ళమా ...హృదయాన్ని హృదయమే రెచ్చగొట్టాలి ... అప్పుడేరా ఆ రహస్య తరంగాలు వెలువడేది ... " అంటూ మిగతా ముగ్గుర్నీ చూసాడు కిషోర్.

అనుకోని ఈ పరిణామానికి అవాక్కయింది భారతి.

"చూడరా ఎంత పెద్దకోరిక దాచుకుందో ... మరి నువ్వేమనుకుంటున్నావ్" కిషోర్‌ని రెచ్చగొడుతున్నట్టు అన్నాడు బాబ్జి.

"మన కోర్కెను మన్నించి లొంగిపోయిందా ... జీవితాంతం ఈ హృదయ దర్పణంలో బిగించి ... పన్నీటితో అభిషేకిస్తూ...పూలతో పూజిస్తా బ్రదర్... కథ యే మాత్రం అడ్డం తిరిగినా ... యే జగదాంబ జంక్షన్లోనో...సరస్వతీ జంక్షను లోనో సజీవ సమాధి కడతా ... "

"తథాస్తు" అన్నారు మిగతా ముగ్గురూ

"భారతీ పద పోలీసులకు చెబుదాం ... నయవంచకులు చూడు ఎంత తెలివిగా నాటకం ఆడుతున్నారో ... మళ్ళీ ఎవరైనా తంతారని పెద్ద మనుషుల్లా యాక్షన్..."

---

**'బొమ్మల కొలువు'లో పాపాయి**

— ఫొటో : సి. వి. చలం









మణిమాల బస్సు దిగి భారతితో మెట్ల వద్దకు వచ్చింది.

"ఓ పని చేద్దాం ... మెట్లెంట నడుద్దాం...ఇలా అక్కడికీ వచ్చి పిచ్చివేషె లేస్తే పెద్దగా అరిచి శుభ్రంగా తన్నిద్దాం... ఓ.కే..." అంది హుషారుగా మణిమాల.

"ఓ.కే..." భయభయంగా అనేసి ఆమె వెంట నడిచింది భారతి. ఇద్దరూ ఒకేసారి అడుగులు కలుపుతూ మెట్లు దిగుతున్నారు. పెద్ద వర...కాశీ ఖనుమ...వైకుంఠరాయుడి మెట్టు...దివ్యశోభలు...పుష్పతోట... బిందెల పనస ... అప్పయ్య పంతులు వ్రతుల మీంచి వచ్చే పంపంగి. గులాబి ... నూరు వరాలు... పున్నాగ...తురాయి పువ్వుల కమ్మని గుబాళింపులు...అనాస...పనస...జీడి మామిడి, రామ ఫలం చెట్లమీంచి వీసే గాలి చల్లగా హాయిగా తనువును మైమరపింప జేస్తున్న ఆ వాతావరణంలో సర్వం మైమరచినట్లు వేదవతీ శిఖరం గట్టుమీద కూర్చున్నారు...మణిమాల ...భారతి.

"అదే స్పాటు...పెద్దవర అంటార్లే ... అక్కడ చూడు గోడవారగా అడివిలోకి దారుంది. అక్కడ వరకూ అవసరం లేదు. వాళ్ళని ఒక్కసారి మట్టడించి నోళ్ళుమూసి ...ఆ గోడ తప్పిస్తే ఎవడొస్తాడు వాళ్ళతాత ... ఆ రాయి చాటుకు చేరుకుంటే ... ఆ తర్వాత..." అంటూ మిగతా ముగ్గిర్నీ వుద్దేశించి వాళ్ళని వప్పించే పద్ధతిలో అన్నాడు కిషోర్ ...

"మెట్లెంట జాగ్రత్త! చాలామంది వస్తున్నారు...వాళ్ళ అరిచి గోలచేస్తే మనభరతం పట్టడం ఖాయం."అని భూషణం అంటే...

## స్పందన

కలాన్ని చేతబడితేనే
కవిత్వం రాదు.
కులాన్ని కూలగొడితేనే
కుటిలత్వం పోదు.
చట్టాలతోనే ...
సంక్షోభిత హృదయాల్లో
సంఘర్షణ ఆగిపోదు.
చట్టాలతోనే ...
సమాజంలోని కౌటిల్యం
సమూలంగా చెరిగిపోదు.
మనిషి మనసు స్పందిస్తేనే
మానవత నిలుస్తుంది.
మనిషి మనసు యోచిస్తేనే
మంచితనం తెలుస్తుంది.

– కె. విశ్వనాథరెడ్డి

"నువ్వు నోరు ముయ్యి ... అన్నీ అనుమానాలే ... రేపు పెళ్ళయితే అక్కడా..." అంటూ మరేదో అన్న కిషోర్ మాటలకు మిగతావాళ్ళు పొట్టలు పట్టుకుని నవ్వారు.

అపాటికి హనుమంత ద్వారం సమీపిస్తున్న నలుగుర్నీ చూసి అమ్మాయిలు ప్రకృతి ఆస్వాదన లోంచి తుళ్ళిపడి లేచి పరుగు పట్టారు.

ముందు ప్రకృతి ఆనందం ... వెనక వికృతంగా కేకలు.

పెద్దవర సమీపించే సమయంలో ఆకాశధార మోకాళ్ళ మెట్ల వద్దకు వచ్చి కిషోర్ హుషారుగా ఈలేసి ఎగిరి టా ... టా ... అంటూ పరుగు పట్టాడు. అంతే...

అలాగే కాలు జారడం ... దాదాపు వంద మెట్లు దిగువన వచ్చిపడ్డాడు. ఆ తర్వాత కె జి హెచ్‌లో చేర్పించారు తతిమామిత్రులు. మనిషంతా బాగానే వున్నాడు. మనసూ ... చూపూ...కదలికా అందం ... ఆకర్షణా అన్నీ అలాగే వున్నాయి.

కానీ —

అతనికి ఒక చెయ్యిలేదు.

అన్నిటికంటే మించిన మరో విషయం... అతనికి ఇప్పుడు పరాయి స్త్రీ అంటే నిజంగా ...పేగు చించుకుని కన్న, తల్లితో సమానం!

★




'ఆ మొక్కను పీకేయించమని మూడ్రోజుల్నుంచీ మ్రోగుతున్నా వినవేమే?' ఈ శ్లోకం ఈ రోజు అత్తయ్య నోటి నుంచి అందుతుందని తెలుసు.

'సాయంత్రం పీకేయించుతాలే అత్తయ్యా— నిన్నా మొన్నా ఒడియాలు పెట్టడం, బట్టలు ఉతకడంతోనే సరిపోయింది' – ఈ రోజు కూడా మాట దాటేశావనిపించింది.

'ఒక్కసారి చెబితే చెవికెక్కదటే— నీకేనా దిగులు. నాకుమాత్రం లేదనుకున్నావా? గుమ్మటంలాగొచ్చిన మొక్కను పీకెయ్యాలంటే నాకుమాత్రం ప్రాణం ఒప్పుద్దా? తప్పదనికాని' మా అత్తయ్య మాటలు నన్ను వోదారుస్తున్నట్టున్నాయ్.

మరలా నా గుండెల్లో గుబులు మొదలయ్యింది. ఈ నాలుగైదు రోజుల్నుంచి నాకు కాలూ చెయ్యి ఆడ్డంలేదు 'ఆ మొక్కను పీకిపారెయ్యాలేమో!' అని అన్పించినపుడల్లా. నెల రోజుల్నుంచీ పెంచుతున్నాను దాన్ని. స్వయంగా నేనే నీరు పోస్తున్నాను రెండు పూటలా. గుమ్మటంలా పచ్చగా ఎదిగింది — అట్లాంటి మొక్కను పీకెయ్యాలంటే ... మహాదిగులుగా ఉంది.

అసలు ఇరుగు పొరుగు మాటలకు విలువివ్వడమే బుద్ధి తక్కువనిపించింది. నలుగురూ నానామాటలంటారేమో! అదే భయం నన గుండెల్లో జీర్ణించుకుపోయింది – వేదాంతం వొస్తుంది.

'ఉప్పు వెయ్యకుండా వెళ్తావే కామీ?' మా ఆయన కొంగు పట్టుకునేసరికి ఈలోకంలోకి వచ్చి సిగ్గుపడి పోయాను – నా పరధ్యానానికి.

నా పరధ్యానం దేనిగురించో మా ఆయన గుర్తించినట్టే ఉన్నారు.

'అన్నిసార్లు చెప్పించుకోవడ మెందుకు మా అమ్మతో. ఆ మొక్కను పీకి పారెయ

కూడదు' భోజనం ముగించి చెయ్యి కడుక్కుంటూ అన్నారు.

'తప్పదంటారా?' ఎందుకో మాట పెగల్లేదు.

'అది కాదు కామీ! మా అమ్మ ఛాదస్తం నీకు తెలియందేముంది. ఆమె తన మాట కంటే కూడా లోకం మాటకే ఎక్కువ విలువిస్తుందని నీకు తెల్సుగా. అట్లాంటావిడ్ని మనం మార్చే ప్రయత్నం చేసేకంటే మనమే సర్దుకుపోవడం తేలిక!'

'అది కాదం ...'

"ఇంకేం చెప్పొద్దు కామీ! కాస్త అర్థం చేసుకో ఎందుకు నచ్చచెప్తున్నానో. నీకా మొక్కంటే ఎక్కువ ప్రేముందని, రోజూ నువ్వు రెండు పూటలా ప్రత్యేకంగా నీళ్ళు పోస్తున్నప్పుడే తెల్సుకున్నాను కాని ఏం చేస్తాం చెప్పు. ఆ మొక్కను గనుక పీకి పారెయ్యకపోతే ఈ యిళ్ళ మధ్యనుంచి విన్నా విన్నా పీకిపారేస్తారు ఇరుగు పొరుగు వాళ్ళు" ఇంకో టైంలో అయితే నవ్వేదాన్నే మాయాయన జోకుకి. కాని నవ్వేంత ఓపిక లేదు నాకా సమయంలో.

ఇంకా ఈ విషయాన్ని పొడిగించదలుచుకోలేదు. నిద్రబోతున్నట్టు కళ్ళు మూసుకున్నాను. నిద్రమాత్రం వచ్చి చావడం లేదు.

అసలు సరస్వతి పెట్టింది ఆ మొక్కకు ఎసరు. వారం రోజుల క్రితం కరివేపాకుకని వొచ్చి చూచింది ఆ మొక్కని.

'మగ బొప్పాయి మొక్క ఇళ్ళమధ్య ఉండడం అరిష్టమట వొదినా' అంది బుగ్గన వేలేసుకుంటూ.

'అది మగచెట్టు కాదు సరస్వతీ! ఆడ చెట్టే,'

'ఎవరు చెప్పారు అది ఆడచెట్టని. బొప్పాయి చెట్టును అసలు ఎరగనట్టే చెప్తున్నావే- అది ఆడదని ఎవ్వరితోను అనక. వింటే నవ్వుతారు.' కుండ బద్దలుకొట్టినట్టుగా మాట్లాడింది

ఆరోజు మధ్యాహ్నమే మరలా మా అత్తయ్యతో అంది- 'మగ బొప్పాయిమొక్క ఇళ్లమధ్య ఉండకూడదట పిన్నీ. ఇందాక అనసూయమ్మత్తయ్యా- సావిత్రొదినాకూడా అన్నారు.'

అప్పుడే ఈ విషయం రచ్చకెక్కిందన్న మాట!

"అలానా సరస్వతీ! వీడు మగ మొక్కని ఎలా పట్టుకొచ్చాడు తెలివితక్కువ వెధవ. మగమొక్కయితే తప్పుతుందా! వాడు రాగానే మరలా ఒకసారి అడిగి పీకిపారేయించుతాలే" సరస్వతికి అభయమిస్తున్నట్టున్నాయి అత్తయ్య మాటలు.

సాయంత్రం మా మరిదిరాగానే అడిగాను.

'వాళ్ళు అమ్మేటప్పుడు ఖచ్చితంగా అది ఆడమొక్కే నన్నారొదినా' తప్పుచేసినోడిలా తల గీక్కుంటూ అన్నాడు.

'అమ్ముకునే వాళ్లు నిజం చెప్తార్రా వెర్రివెధవా' నగ్నసత్యం చెప్పినావిడలా ఫోజు పెట్టింది.

ఆ మొక్కను పీకి పారెయ్యాల్సొస్తుందే అని ఎవరికీ దిగులే దు. అవున్లే. వారికెందుకుంటుంది. నెల రోజుల్నుంచే నీరు పోసేది నేను. నాకుకాక ఎవరికుంటుంది దిగులు.

ఆ మొక్కని నెలరోజుల క్రితం మా మరిది సూరిబాబు హైదరాబాదు కాంపుకి వెళ్ళి పట్టుకొచ్చాడు నేనే దానిని దొడ్లో పాతిపెట్టాను, సహజంగా నాకున్నటువంటి బొప్పాయి కాయలంటే గల ఇష్టం మీద. అందుకే దాన్ని ప్రాణప్రదంగా పెంచుకొంటున్నాను. తీరా తెచ్చాక అది మగ మొక్కయి కూర్చుంది. వెక్కిళ్ళు పెట్టి ఏడుద్దామని పిస్తుంది దాన్ని పీకెయ్యాలనే తలంపురాగానే. 'ఇంత చిన్న విషయానిక్కూడా ఏడవాలా' అని అందరూ ఎగతాళి చేస్తారని తప్పించిగాని.

'అది గారంటీగా మగ మొక్కేనంటావా మూర్తీ.'

'అయ్యుండదొదినా' అంటాడేమో అను కున్నా-

'నాకూ మొదట్లో నమ్మకం కుదర్లే దొదినా. కాని ట్రైన్‌లో నమ్మొంటే నలుగు రైదుగురు అన్నారు 'మొగమొక్కనేం చేసు కుంటావ్ బాబూ' అని- తీరా ఇప్పుడేమో యిరుగు పొరుగు వాళ్ళు కూడా అదే మాటం టున్నారుగా. మగదే అయ్యుంటుందేమో.'

నా ట్రాజిడీ సన్నివేశాన్ని ఇంకా పెంచేట్టు చేశాడు.

సరస్వతి చెప్పిన మరుసటి రోజునే మా ఇంట్లో అద్దెకుంటున్న అబ్బాయి నడిగా 'అది మగ చెట్టేనా మూర్తీ' అని!

'నాకు మొక్కలగూర్చి అట్టే తెలీదక్కయ్యగారూ. మా ఫ్రెండింట్లో బొప్పాయి చెట్టుంది. ఓ ఆకు కోసుకొచ్చి చూద్దాం' అన్నాడు.

ఆ రోజు సాయంత్రం మూర్తి తెచ్చిన ఆకుకీ మా చెట్టు ఆకుకీ కనీసం 'ఈ నెల వ్యాసం'లో కూడా సంబంధం లేదు. నేనూ ధృఢపడ్డాను- అది మగదేనని బాధ పడ్డాను మామూలుగానే. అయినా ఓ నిర్ణయాని కొచ్చాను- దాన్ని పీకి పారేయ్యమనుకోలేదు. 'పచ్చగా అన్నాళ్ళు ఉంటుందిలే చూట్టానికి. ఉంచుదాం' అనిపించింది

కాని మూడో రోజు నుంచి చుట్టుపక్కల వాళ్ల పోరు భరించలేక పోయాం. నేను అంతగా పట్టించుకో దలుచుకోలేదు కాని మా అత్తయ్యపై వాళ్లపోరు బాగా పని



# ఇదీ ఆడకధే

చేపింది వాలుగో రోజు నుంచి మా అత్తయ్య కూడా వాళ్ళలో ఒక మెంబరయ్యింది!

ఆ రోజు నుంచీ—

వాళ్ళు ఒక్కోక్కొగను సొంతంచేసుకున్నారు.

'అరిష్టమని, తెల్సి కూడా ఎందుకు పీకించలేదు'— సరస్వతి,

'మగవెట్టుకు కాయలు కాయింమతావా' అని సావిత్రి,

'అరిష్టం చుట్టుపక్కల వాళ్ళకంటించ కమ్మా' అని అనసూయమ్మ,

'దీన్ని పీకేయించమని ఎన్నిసార్లు మొత్తుకోవాలె' అని అత్తయ్య,

కాకుల్లా కేకలేయడం మొదలెట్టారు

'పెద్దవాళ్ళ మాట పట్టించుకోవేం కామాక్షీ' అంటూ మా ఆయన గొంతు కదిలించారు, వీరి మూతి తిప్పళ్ళు చూసి

'ఈ సారి జాగత్తగా చూసి తిసుకొస్తాలే ఒదినా' మా మరిది ఓదారుస్తున్నట్టుగా అన్నాడు. అంతర్గాంగా పీకేయించవనే' అర్థం విన్పించింది నాకు.

ఇక తప్పదనిపించింది— మూడ్రోజుల్నుంచీ పీకేదామనుకుంటూనే కాలూ చెయ్యూ ఆడక ఆ పని చెయ్యలేకపోతున్నాను

మొక్కను నరికేద్దామంటే, చేతులు రావడంలేదు. అందుకే పాదు నిండా నీళ్ళు పోసి మట్టిని నానబెట్టి వేరు కూడా తెగకుండా జాగత్తగా పీకి అవతలపారేసి చేతులు కడుక్కున్నాను

మా అత్తయ్య గుండెల మీద కుంపటి దించుకున్నంత ఆనందపడింది. మా ఆయన ఇంట్లో వాయుగుండం తప్పిపోయినంత సంబరపడ్డారు. మా మరిది ఇక ఇంట్లో ఏంగొడవలుండవులే అన్నంత ఫ్రీ ఫీలయ్యాడు. ఇరుగు పొరుగోళ్ళు అరిష్టం తొలిగిపోయినట్టు గాలి పీల్చుకున్నారు - సరస్వతి ఇంతకు ముందు కంటే ఆప్యాయంగా మాట్లాడుతోంది.

ఆ మొక్క పీకిన గుంట రోజు రోజుకీ పూడిపోతున్నట్లే నా మనసు కూడా దిగులు మెల్లమెల్లగా మాయమౌతోంది.

బొప్పాయి మొక్క అధ్యాయం ముగిసి పదిహేను రోజుల తర్వాత ఓ రోజున—

పూజకోసం పూలు దొరక్కపోతే

సరస్వతింటికెళ్ళాను రెండుమందార పూలన్నా కోసుకోద్దామని.

'దొడ్లోకెళ్ళి కోసుకో వొదినా – పొయ్యి మీద తాలింపు వేశాను మాడుతుందేమో' అని లోపలికెళ్ళింది నేను దొడ్లో కెళ్ళాను. మందారపూలు కోసుకొని రాబోతూ–మందార చెట్టుకు నాలుగడుగుల దూరంలో ఉన్న చెట్టును చూసి అదిరిపడ్డాను. జాగ్రత్తగా పరిశీలించాను, అనుమానం లేదు. అది ఆ మొక్కే! తాను పదిహేనురోజుల క్రితం పీకి పారేసిన బొప్పాయిమొక్కే! మరల జీవం పోసుకొని పచ్చగా తయారవుతోంది. కళ్ళు తిరిగినంత పనైంది. తూలి పడబోయి తమాయించుకున్నాను.

'మగ మొక్క అరిష్టమొదినా' అన్న సరస్వతి అదే మొక్కని తన దొడ్లో ఎలా నాటుకుంది ?

'ఏంటొదినా అలానే నిలబడ్డావ్' అంటూ వొచ్చింది సరస్వతి

'అది మగ బొబ్బాయి చెట్టులా ఉందే సరస్వతీ' నిగ్రహించుకొని అన్నాను.

"అది చూట్టానికి మగదిలానే ఉంటుం దొదినా. ఇదో హైబ్రిడ విత్తనమట. మామూలు జాతికీ, ఈ జాతికీ అసలు సంబంధం వుండదు. కనీసం ఆకు కూడా పోలికుండదొదినా మా ఆయన తెచ్చి పాత్తుంటే అడిగా 'అది మగది కదండీ' అని. 'చూట్టానికలానే వుంటుందిలే! ఇది హైబ్రిడ విత్తనం. కాని ఆడదే – మూడు నెలల్లో కాపుకొస్తుంది చూస్తుండు-అసలు దీన్ని కనిపెట్టిన శాస్త్రవేత్త' అంటూ ఏదేదో చెప్పారొదినా అన్నట్టు మీరు ఇదివరకు నాటిందీ ఇలాంటి మొక్కనే కదూ! అది కూడా..." ఏమిటేమిటో చెప్పుకెళ్తోంది సరస్వతి.

నాకేం వినిపించటంలేదు సరస్వతిమాటలు. ఆకాశం నెత్తిన పడుతున్నట్టు అన్పించింది. గొంతు తడారిపోయింది. కంట్లో నీటిపొర చేరినట్టు నాకు మాత్రమే తెలుసు. ఇంకా అక్కడ వుంటే నిగ్రహం సడలిపోతుందని ఇంటివైపు కాళ్ళీడ్చాను— సరస్వతి 'వొదినా— వొదినా' అంటూ పిలుస్తున్నా వెనక్కి తిరిగైనా చూడకుండా.

## పత్రికారంగంలో క్రొత్త ప్రయోగం

పశ్చిమజర్మనీ తపాలాశాఖ వారు వార్తారంగంలో సరిక్రొత్త అధ్యాయాన్ని ప్రారంభించారు. ఈ పథకం ప్రకారం తాజావార్తల కోసం రేడియో ప్రసారాల సమయం దాకా వేచి యుండనక్కర్లేదు. ఇంట్లో టెలివిజన్ను 'ఆన్' చేసి కోరిన పత్రికాఫీసు వారి నంబరు త్రిప్పితేచాలు. వార్తలు టెలివిజన్లో కనిపిస్తాయి. పత్రికల వారు తాజా వార్తలను ఏప్పటి కప్పుడు వీడియో టెక్స్ట్ కంప్యూటర్లలో పొందు పరుస్తుంటారు. ఈ పథకం సుమారు ఒక సంవత్సరంగా పశ్చిమ జర్మనీలో ప్రయోగాత్మకంగా నిర్వహిస్తున్నారు. ఇందులో సుమారు వెయ్యిమంది ప్రొడ్యూసర్లు, నాలుగు వేలమంది ఖాతాదార్లున్నారు.

# వంటలు

## సగ్గుబియ్యం ఉప్మా

ఒక కప్పు సగ్గుబియ్యాన్ని బాగా నాలుగైదు గంటలు నీళ్లల్లో నాననిచ్చి నీళ్ళు పారబోసి చిల్లుల పళ్లెంలో వేసుకోవాలి. రెండు ఆలుగడ్డలు, ఉల్లిగడ్డలు సన్నగా ముక్కలు తరిగి నూనె, ఆవాలు, మినపప్పు వేసి తిరగమాత వేయాలి నానిన సగ్గుబియ్యంలో వేయించిన వేరుసెనగపొడి, పుట్నాలపొడి, పసుపు, తగినంత ఉప్పు కారం కలిపాలి దీన్ని ఆలుగడ్డల ముక్కల్లో వేసి సన్నని సెగమీద ఒక పదినిముషాలు ఉడకనిచ్చి దించి నిమ్మకాయ, కొత్తిమీర కరివేపాకు కలిపితే చాలా రుచిగా ఉంటుంది

— అచ్యుతుని లక్ష్మి కనకవల్లి

## సేమ్యా హల్వా

కావలసిన వస్తువులు :- సేమ్యా పేకెట్టు 1 (200 గ్రా), పాలు పావులీటరు, ఆరోరూట్ పౌడరు 100 గ్రా, జీడిపప్పు 25 గ్రా, పంచదార అరకిలో, నెయ్యి లేక డాల్డా 200 గ్రా, ఏలకులు 10 గ్రా

చేయు పద్ధతి :- సేమ్యాను కొద్దిగా నెయ్యివేసి వేయించుకోవాలి జీడిపప్పు కూడా వేయించాలి ఒక స్టీలుగిన్నెలో వేయించిన సేమ్యావేసి, పాలుపోసి పొయ్యిమీద పెట్టాలి. సన్నటి సెగమీద కాచాలి. 10 నిమిషాలకు అది సరులాగు అవుతుంది. అప్పుడు ఆరోరూటు పిండి, పంచదారవేసి కలుపుతూ వుండాలి గట్టిగా అయ్యేదాకా కలుపుతూ వుండాలి అడుగంటకుండా చూచుకోవాలి గట్టిగా అవగానే నెయ్యిగాని డాల్డాగాని వేసితిప్పాలి

చేతికంటుకోకుండా హల్వాలాగ వుంటుంది. ఏలకులపొడి, జీడిపప్పువేసి దింపి వెయ్యాలి. ఒక స్టీలు పళ్లేనికి నెయ్యిరాసి హల్వా అందులో సమానంగా సర్దుకోవాలి. చల్లారిన తరువాత పీస్‌గా ముక్కలు కోసుకోవాలి. తినటానికి చాలా బాగుంటుంది. జీడిపప్పు ఎవరిఇష్టం ప్రకారం వారు వేసుకోవచ్చు.

ఇది తొందరగా, తేలికగా అయ్యే స్వీట్!

— చావలి అనసూయాదేవి

దశరా శుభాకాంక్షలు



## బిల్లు భూతం!

ఢిల్లీకి చెందిన డాక్టరు సన్నాస్సైనుఖాన్ జూన్ నెలలో టెలిఫోను పెట్టించుకుని తన చిరకాల వాంఛ నెరవేరిందని ఎగిరి గంతేసి, ఆనందాతిశయాలతో మూర్ఛపోయి, తేరుకుని కొయ్యబారిపోయాడట. టెలిఫోను పెట్టిన రెన్నెల్లకు ఆయనకు వచ్చిన బిల్లులో 10,003—85 కట్టాలనీ, ఈ మొత్తం గత ఇరవయి సంవత్సరాలుగా బకాయి ఉన్నదనీ, టెలిఫోను ఎక్కవుంట్సాఫీసరుగారు ఆ బిల్లులతో ఓ లేఖ కూడా జత చేసి పంపారట.

## కట్న పిశాచి!

కట్నాలివ్వని ఆడపిల్లను అత్తవారి ఇంటిలో ఎంతెంత బాధలు పెడుతున్నారో తలుచుకుంటే కట్నం ఇస్తామని పెళ్ళిచేసి, ఇవ్వలేకపోయిన స్థితికన్నా కట్నం ఇవ్వలేక పెళ్ళికాకుండా ఉన్న స్థితే నయమని ఈ రెండు సంఘటనలూ బేరీజు వేసిన వారి అభిప్రాయం. కలకత్తాలో కట్నం ఇవ్వని ఓ అబల అత్తారింట్లో బాధలూ, భర్త పెట్టే బాధలూ పడలేక నారి రక్షణ సమితివారిని ఆశ్రయిస్తే, వారు వూరేగింపుగా ఆమె అత్తారింటికి వెళ్ళి ఆమె భర్త పేరునా, అత్త పేరునా డువున్ డువున్ గేయాలు పాడి, ఆనక ఆమె భర్త రూపాన్ని గడ్డితో చేసి తగులబెట్టారట.

## పక్షిని మానభంగం చేసిన మనిషి!

గ్రీసు దేశానికి చెందిన తినాస్ ద్వీపంలో మొరాకో దేశస్థుడయిన అబ్దెల్ బిహంతలాల్ అనే ఓ ఇరవయి ఎనిమిదేళ్ల యువకుడు ఒక పెలికన్ [పెద్ద ముక్కుతో కొంగలా ఉండేది] పక్షిని పట్టుకుని దానితో తన కామదాహం తీర్చుకున్నాడట. తత్ఫలితంగా ఆ పెలికాన్ అధిక రక్తస్రావంతో మరణించిందట. ఇతన్ని పోలీసులు అరెస్టు చేసి సిటిపతి ముందుంచితే ఆ దీవి వారు తనను అవమానించారని, దానికి ప్రతీకారంగా తాను 'ఆపని' చేశానని చెప్పాడట!

## నిరుద్యోగ పథకం!

ఫ్రాన్సులో నిరుద్యోగ సమస్యను ప్రభుత్వం భరించలేక ఓ పథకం వేసిందట. ఆ ప్రకారం ఇప్పుడు ఉద్యోగాలలో ఉన్నవారు సగం జీతమో కొంచెం ఎక్కువో తీసుకుని ఓ సంవత్సరం శెలవుకి పోవాలట. ఆ శెలవు ఖాళీలలో నిరుద్యోగులను వేస్తారట. తిరిగొచ్చాక వారి ఉద్యోగాలు వారికి గ్యారంటీగా ఉంటాయట. అంతకన్నా ఉద్యోగం లేని వారికి ఆ డబ్బు పంచేస్తే పోలా సెలసెలా!!

# ప్రశ్నావళి

కె. రామలక్ష్మి

**డి. జె. ఆర్. – విశాఖపట్నం**

అంత విపరీతంగా పొగిడించుకుంటారేం నాయకులు. సిగ్గు వేయదా?

వేయదు. పొగిడే వాడికి లేనిది వారికెందుకు? అయినా— ఏ అవసరమో అప్పు లేకపోతే ఉట్టనే పొగడరని వారికి తెలుసు.

కోరి ఇస్తే గౌరవంగా వాడరెందుకు చాలామంది?

అడక్కుండా ఇచ్చేదానికీ, చౌకగా వచ్చేదానికీ విలువనివ్వరు.

జీవితం అంటే ఏమిటి?

ఎవరికి? బలవంతునికా? బలహీనునికా? బలవంతునికైతే ఆట. బలహీనునికైతే పోరాటం. మధ్యస్థులకైతే ఉట్టి ఆరాటం!!

**వి. వి ఆర్ ఆర్. – యానాం**

చూడండి, దీపాలు వెలగడం గొప్ప కాదు. దాన్ని వెలిగించి, వెలిగేట్టు చేయడం గొప్ప. అలాంటి వ్యక్తి నిజమైన హీరో. అలాంటి టీచర్‌కు మీరేం ప్రాధాన్యత ఇవ్వక, అదృష్టంతో పైకి వచ్చిన కోటిగాడిని హీరోగా చిత్రించడం సిగ్గు చేటు. హరిజనుల్లో కోటిగాడి వంటివారికి ఏం ఇబ్బంది లేదు.

మీరు వీరావేశంతో రాసిన పెద్ద ఉత్తరం చదివాను. నేను కోటిగాడు చిత్రం తీస్తున్న మాట నిజమే. గాని మీకెందుకు కోటిగాడిమీద ఇంత కోపం? మీ కోపాన్ని పట్టి తెలియడంలేదా— ఈ దేశంలో ఇందిరలాంటి టీచర్లుండబట్టే కొంత రేనా వెల్గు చూస్తున్నారని! ఇంకా ఇంత సంకుచితంగా ఆలోచించి మీలాంటి వాళ్ళుండబట్టే కులాలపోరాటాలు తప్పడంలేదేమో అనిపిస్తుంది. మన సమాజం మారాలంటే తల్లుల దృక్పథాలు మారాలనీ, వారు మారితే జాతి జాతే మారుతుందనీ నా నమ్మకం. ఆ దృష్టితోనే కోటిగాడి కథ ముగ్గురు తల్లుల ముఖతా చెప్పాలని నా ప్రయత్నం. ఒక బ్రాహ్మణ తల్లి, ఒక మాల తల్లి, ఒక యూనివర్శిటీ మదర్— టీచరు. అంతేగాని — హరిజన బ్రాహ్మణ శిబిరాలు కాదు దానిలో ప్రధాన వహించే ఫుటాళ్ళు. మీరు నిశ్చింతగా ఉండండి.

**వి. కె. కె. – గుంటూరు**

నేటి సమాజంలో స్త్రీలు కంటే పురుషుల వల్ల పడుతున్న ఇబ్బందుల నివారణకు సూచన చెప్పండి?

ఒకటి— ఇగ్నోర్. రెండు—నిలబడి అడగటం. మూడు—పోలీసురిపోర్టు ఇవ్వడం [ఎవరి నేనాపాయ తీసుకుపోకొల్లి!] లేదా ఎవరైనదీ తెలియకుండా తన్నించడం!!

# అభివృద్ధి పథంలో ఆంధ్రప్రదేశ్ ముందడుగు





మన ప్రియతమ ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధీ చైతన్య పూరితమైన నాయకత్వంలో మనదేశం, మన రాష్ట్రం అపూర్వమైన రీతిలో ముందడుగు వేస్తున్నది. ప్రజా నాయకుడు, ముఖ్యమంత్రి శ్రీ టి. అంజయ్య సారథ్యంలో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం శృజనాత్మకమైన నూతన పథకాలతో గమనార్హమైన విజయాలు సాధిస్తూ సౌభాగ్య సంపదల సాధనా పథంలో పయనిస్తున్నది.



శ్రీమతి ఇందిరాగాంధి (ప్రధానమంత్రి)

శ్రీ టి. అంజయ్య (ముఖ్యమంత్రి

**ఆచరణలో ప్రజాస్వామ్యం :** మన రాష్ట్రం చరిత్రలో ప్రప్రథమంగా బలహీనవర్గాలకు పంచాయతీ సంస్థలలో ప్రాతినిధ్యం కల్పించబడింది. రాష్ట్రంలో చిన్నపాటి సాధారణ ఎన్నికల రీతిలో గ్రామ పంచాయతీ, పంచాయతీ సమితులు, జిల్లా పరిషత్తులకు ఎన్నికలు నిర్వహించారు. 6260 గ్రామ పంచాయతీలకు, 12 పంచాయతీ సమితులకు ఏకగ్రీవంగా ఎన్నికైనందుకు నగదు రొక్కం రూపంలో ప్రోత్సాహక బహుమతులు యిస్తున్నారు.

**రైతులకు రాయితీలు :** పంటల భీమా పథకం మద్దతు ధర, సబ్సిడీలు, 65 సంవత్సరాల వయస్సుకు పైబడిన వ్యవసాయ కూలీలకు పింఛను పథకం, 5 ఎకరాల మాగాణి లేదా 10 ఎకరాల మెట్ట భూమిగల రైతులకు భూమిశిస్తు మినహాయింపు వంటి అనేక రాయితీలను రైతులకు కల్పించి, వారి ఆర్థిక పరిస్థితులు మెరుగు పడడానికి దోహదం చేశారు.

**గ్రామీణులకు ఉపాధి :** గ్రామీణ యువకులకు ఫలవంతమైన ఉపాధి కల్పించడానికి వీలుగా గ్రామీణ ఉపాధి కార్యక్రమాలను చేపట్టారు.

**అన్ని ప్రాంతాలలో మంచినీటి సరఫరా :** రాష్ట్రంలోని అన్ని గ్రామాలకు మంచినీటి సౌకర్యం కల్పించడానికి ఒక బృహత్ప్రణాళికను రూపొందించారు.

**బలహీనవర్గాలకు ఇళ్లు :** బలహీనవర్గాలకు నాలుగు లక్షల ఇళ్ళు నిర్మించాలని ప్రతిపాదించారు, దానికితోడు గిరిజనుల సర్వతోముఖాభివృద్ధికి పథకాలు రూపొందించారు.

**గుడిసెల భీమా పథకం :** గుడిసెవాసులకు అగ్ని తదితర ప్రమాదాలనుంచి రక్షించి భీమా ప్రయోజనాలు కల్పించడానికి అపూర్వమైన పథకాన్ని ప్రవేశపెట్టారు.

**పరిశ్రమల ప్రగతి :** రాష్ట్రంలో పారిశ్రామిక ప్రగతి, సాంకేతిక అభివృద్ధి గణనీయంగా సాధించబడింది. ప్రస్తుత సంవత్సరంలో కొత్తగా 4,000 లఘు పరిశ్రమల యూనిట్లు ఏర్పాటు చేయాలని ప్రతిపాదించారు. సింగరేణి బొగ్గు గనులద్వారా గత జూలైలో రికార్డుస్థాయిలో 10 లక్షల టన్నులకు పైగా బొగ్గు ఉత్పత్తి చేయడంలో సత్వర పారిశ్రామిక ప్రగతికి దోహదం కలుగుతున్నది.

**25 సూత్రాల కార్యక్రమం :** మన రాష్ట్రంలో ప్రధానమంత్రి 20 సూత్రాల ఆర్థిక కార్యక్రమం, సంజయ్‌గాంధీ 5 సూత్రాల కార్యక్రమాలను ముమ్మరంగా అమలు జరపడంతో ప్రగతిపథంలో నూతన శకం ప్రారంభమైంది.

---

డైరెక్టరు, సమాచార, పౌరసంబంధశాఖ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం DIPR No. 25514/Advt/CI-3/81

ఆంధ్ర సచిత్ర వారపత్రిక పరిశీలనార్థం పంపే బొమ్మలు, ముఖచిత్ర రచనలు పంపేవారు కూడా వాటితోపాటు తగినన్ని తపాలా బిళ్లలు అంటించిన కవరును జతపరచకపోతే అవి త్రిప్పి పంపబడవు. —సం.

# ప్రశ్నావళి

**పి ఆర్ — మహబూబ్‌నగరం**

నేడు విపరీతంగా ఎక్కువైన రేప్‌లకు కారణం స్త్రీల వేషధారణ అంటున్నారు.

అంతే కాని మగవాళ్ళలో ఉన్న అల్ప బుద్ధి కాదని. కామావేశముకు లొంగితే ఉంటుందా ఆడదానికి స్వేచ్ఛగా తిరిగే అవకాశం? రేప్‌కి కేసులు కాదు పెట్టవలసింది ఫైరింగ్ స్క్వాడ్స్ అమానుషకం అయినా అదొక్కటే మానవులని అరికట్ట కలదు!

**వెంకట్ — ఉరవకొండ**

పురాణ కాలంలో ఉండిన సాంఘిక గౌరవం, సమానత్వం నేటి స్త్రీలకు తిరిగి రావాలంటే?

వాటేం చెప్తున్నారు సార్! అగ్ని పరీక్షకు నిలిచిన సీత గౌరవం, జుట్టు పట్టి ఈడ్వబడిన ద్రౌపతి గౌరవం, పట్టడవిని విడిచి పెట్టబడిన దమయంతి ఘనత, ఇనుప గుగ్గిళ్ళు వండవలసిన అరుంధతి గొప్ప, కుష్ఠు రోగుణ్ని వేశ్యల కొంపలకు తిప్పవలసిన సుమతి గొప్ప, పర పురుషుణ్ని మనసున స్మరించి పరీక్షకు మోసే ఇసుక కుండ వల్ల ముప్పు తెచ్చుకుని కొడుకుచేతం నరకబడి రేణుక— ఇవా మనం చూపవలసిన నవ నవ నతలు! వద్దు. గత కాలము మేలు వచ్చు కాలము కంటెన్ అన్నది—ఆడవాళ్ల విషయంలో కాదు. ..

ఆర్థికావసరాలకు, నైతిక విలువలకు సంఘర్షణ ఏర్పడినప్పుడు దేనికి ప్రాధాన్యత ఇవ్వాలి?

ఆర్థికావసరాలకే కాని లేకపోతే అడుగు ముందుకు వెయ్యలేరీ— ప్రపంచంలో.

ఈ కాలంలో అందానికి డబ్బుకి పోటీ పెడితే ఏది గెలుస్తుందంటారు కె రా. గారూ?

డబ్బే వెంకట్ గారూ.

# హైదరాబాదు నోట్‌బుక్

స్వాతంత్ర్య సమర కురువృద్ధు

శ్రీ పరిగి రామసుబ్బయ్య :

గాంధి ఆస్పత్రిలో కార్డియాలజిస్ట్, డాక్టర్ సంపత్కుమార్ ఇంట్లో అలనాటిస్వాతంత్ర్యసమర యోధులు శ్రీ పరిగి రామసుబ్బయ్యగారిని అకస్మాత్తుగా దర్శించినప్పుడు ఆనందాశ్చర్యాల వాలో పెనవేసుకున్నాయి. శ్రీ రామసుబ్బయ్య జన్మస్థలం అనంతపురం జిల్లా హిందూపురం తాలూకా పరిగి, నేటి స్థిరనివాసమూ ఆ గ్రామమే. శ్రీ రామసుబ్బయ్య 1906 లో జన్మించారు (పరిగిలో). శ్రీ నారాయణభట్టు అనే వారివద్ద ఉపయుక్తాంశాలు నేర్చుకొన్నారు. పిదప 1922 నుంచి నాలుగేళ్ళ పాటు షట్‌శాస్త్ర పండితులు శ్రీ చీరేపల్లి దేశికాచార్యులవద్ద, శ్రీ శివగంగశంకరాచార్యుల గురువర్యులైన శ్రీ కొత్తకోట సుబ్బశాస్త్రుల వద్ద కావ్యనాటకాలు, శాస్త్రప్రకరణ గ్రంథాలు అధ్యయనం చేశారు. ఇంతలో స్వాతంత్ర్య సమరసేనానులు శ్రీ కల్లూరుసుబ్బారావు, పప్పూరు రామాచార్యులతోను, నేటి రాష్ట్రపతి శ్రీ సంజీవరెడ్డి వంటి ప్రముఖ కాంగ్రెస్ కార్యకర్తలతోను పరిచయం కలిగింది. జీవిత విధానం, లక్ష్యం మారిపోయాయి.కారణం శ్రీ కృష్ణారావువంటి వారి సాహచర్యంతో సేవా దృక్పథం స్థిరపడింది. 1936 లో కాంగ్రెస్ సభ్యులుగా చేరారు. తాలూకా కాంగ్రెస్ అధ్యక్ష పదవి, జిల్లా కాంగ్రెస్ కార్యవర్గం సభ్యత్వం నిర్వహించారు. 1941 లో వ్యక్తిగత సత్యాగ్రహంలో అరెస్టయి బళ్లారి అలీపూర్ క్యాంప్ జైలులో సంవత్సరం గడిపారు. అప్పుడు ఆయన సహచరులు శ్రీ యుతులు నేతి చలపతిరావు, మద్ది సుదర్శనం,కె.ఎస్. రాఘవాచార్యులు, మోతే నారాయణరావు,అద్దేపల్లి సత్యనారాయణ మున్నగువారు. కారాగారంలో ఆయన విద్యారణ్యులు రచించిన శంకర విజయాన్ని పురాణం చెప్పేవారు.

1947 ఆగస్టు 15 న స్వాతంత్ర్యం సిద్ధించింది. రామసుబ్బయ్య ఆగస్టు 16 వ తేదీన పరిగిలోని సప్తమాతృకా దేవాలయంలో హరిజనులకు ప్రవేశం కల్పించి వారి సాంఘిక బంధనాలు త్రెంచి వేశారు. క్రైస్తవులను హిందువులుగా మార్చి వివాహం చేయించారు.

అనంతపురం, బ్లాక్‌డెవలప్‌మెంట్ సంఘం సభ్యులుగా పదేళ్లు పని చేశారు. ఇంటర్ స్టేట్ బ్లాక్ డెవలప్‌మెంట్ సమినార్‌లో అనంతపురం జిల్లా ప్రతినిధిగా పాల్గొన్నారు. 1948 లో పరిగిలో సహకార సంఘం స్థాపించారు. అది 1959 లో విశాల పరపతి సంఘ మయింది, దానికి ఉపాధ్యక్షులుగా 20 సంవత్సరాలు పని చేశారు. హైస్కూలు సంఘ సభ్యులుగా హైస్కూలు భవన నిర్మాణం కోసం ఎన్నో వేల రూపాయలు ప్రోగు చేసి, సుందర భవనాలు నిర్మింపగలిగారు. ఇప్పుడు జూనియర్ కాలేజీ స్థాపనకు ప్రభుత్వం నుంచి వాగ్దానాలు పొందారు.

1935—37 లో అనంతపురం జిల్లాలో క్షామ నివారణ కార్యక్రమాలు జరిగినపుడు, తాలూకా క్షామ నివారణ సంఘం సభ్యులుగాను, హిందూపురం సహకార మార్కెట్‌కమిటీసభ్యులుగాను, పెన్నా—కుముద్వతీ ప్రాజెక్టు (పరిగి) ఆయకట్టుదార్ల సంఘం అధ్యక్షులుగా నిరంతర ప్రజాసేవ చేశారు. ఈ వయస్సులోను ఈ అధ్యక్ష పదవి ఇంకా ఆయనను వదల లేదు.

పెన్నా— కుముద్వతీ ప్రాజెక్టు నిర్మాణ సమయంలో అక్కడి పనులను పర్యవేక్షిస్తున్న రామసుబ్బయ్య నీటిలో మునిగి పోయారు.పిదప దైవానుగ్రహం వల్ల గండం గడిచి వచ్చారు. అప్పుడు ముఖ్యమంత్రిగా వున్న శ్రీ సంజీవరెడ్డి ప్రత్యేకంగా వచ్చి ఆయనను పరామర్శించారు. రామసుబ్బయ్య మూడు పచ్చీసులవయసు పై బడినా పహలా పచ్చీసు ఉత్సాహంతో భాగవత రామాయణాలు ఉపనిషత్తులు పరిశీలిస్తుంటారు. అదే సమధికోత్సాహంతో ఇతరులకు వాటి రహస్యాలు వివరిస్తారు. రామసుబయ్యకు ఐదుగురు కుమారులు, ముగ్గురు కుమార్తెలు. కార్డియాలజిస్ట్ సంపత్కుమార్ ప్రథమ పౌత్రుడు. రామసుబ్బయ్య తనను రాజకీయాలలో ప్రవేశపెట్టిన శ్రీ కల్లూరు సుబ్బారావుగారిని, సంఘ సేవలో ప్రోత్సాహించిన శ్రీకరణం కృష్ణారావుగారిని కృతజ్ఞతతో స్మరిస్తారు. రామసుబ్బయ్య రాజకీయ,సాంఘిక విజ్ఞాన ఖని. ఆయన విజ్ఞానం అనుభవవిశేషాలు నేటి యువకులకు మార్గదర్శకాలుగావుంటాయి. కనుక వాటిని ఆయన లిఖిత రూపం చేయాలని కోరుతున్నాను.

జాకోరా ఖైసా ఇయూః :

జాకో రాఖై సాఇయా,  
మారి న సక్కై కోయ్,  
బాల న బాంకా కరసకై  
జో జగబైరీ హోయ్ !—

ఎవరిని భగవంతుడురక్షిస్తుంటాడో—వారిని ఎవరూ ఏమీ చేయలేరు. జగచ్ఛత్రువైనప్పటికీ దైవ రక్షితుని వెంట్రుకనైన వంచలేడు అని ఆ నాడు కబీర్ దాస్ ఘంటాఘోషంగా అన్న మాటలే, ముఖ్యమంత్రి శ్రీ అంజయ్య సెప్టెంబర్ 15 న పత్రికా ప్రతినిధులు గోష్ఠిలో గట్టిగా చెప్పారు. కాని, ఒక్క తేడా— కబీర్ దాస్ భగవంతుని రక్షణలో వున్న వాడిని అంటే,ముఖ్యమంత్రి శ్రీమతి ఇందిరాగాంధి రక్షణలో వున్నవాడిని— అన్నారు. "నా స్థితి బలంగా వుంది. ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధి తప్ప మరెవరూ నన్ను కదలించలేరు. నన్ను తొలగించవచ్చునని భావించేవారు అవివేక ప్రపంచంలో వున్నారు'' అని ఆయన బల్ల గుద్ది మరీ చెప్పారు. మంత్రివర్గ సమావేశం తర్వాత ముఖ్యమంత్రి పత్రికా ప్రతినిధుల గోష్ఠిలో ఇంత దృఢంగా చెప్పడం ఇదే మొదటిసారి. నన్ను తొలగించడానికి నా ప్రత్యర్థులు చేసే ప్రయత్నాలు ఫలించవు. ఎందుకంటేనేను శ్రీమతి గాంధి నియమితుడిని గనుక ఆమెకు ఇష్టం లేకపోతే నన్ను ఆమె ఏ క్షణంలోనన్నా తొలగించవచ్చు. నేను వైదొలగడానికిసిద్ధంగా వున్నాను. ఆమె కోరికపై నేను ముఖ్యమంత్రి పదవిలో వున్నాను. నేను పదవిలో కొనసాగడం విషయంలో నాకు ఎలాటి సందేహమూ లేదు. అందువల్ల నేను ఢిల్లీకి తరచు పరిగెత్తను. ఇంతకూ నా తరఫున ఢిల్లీకి రాయబారం పంపే అలవాటు కూడ నాకు లేదు. నాకోసం ఎవ్వరూ ప్రచారం చేయనక్కర లేదు. నా గురించిఇతరులకంటే శ్రీమతి గాంధికే బాగా తెలుసు అని శ్రీ అంజయ్య అన్నారు. ఇందిరాకాంగ్రెస్ కార్యదర్శి శ్రీ ఎస్. ఎస్. మహాపాత్ర ఆంధ్రవ్యవహారాలను చూడడం లేదని ముఖ్యమంత్రి అన్నారు.

ఉపశ్రుతి :

బలవంతుడ నాకేమని పలువురితోనిగ్రహించి పలుకుట మేలా? అని అడిగాడు ముఖ్యమంత్రి పత్రికా ప్రతినిధుల గోష్ఠిలో చేసిన ప్రకటన చదివిన ఒక పెద్ద మనిషి. అదేమిటి ? ఆయన తాను బలవంతుడినని చెప్పుకోడం లేదే, తనకు శ్రీమతి గాంధి అభయహస్తం వుందనిగదా అంటున్నారు— అని ఒకరు అడ్డుతగిలారు.

— తిరుమల రామచంద్ర



## గెలుపు!

నేను విడిచిన శాంతి పావురాల్ని  
నీవు విడిచిన డేగలు  
తన్నుకు పోయాయని పొంగిపోకు  
వాటి ముఖాల్లోని  
ఆకలి దెయ్యాల్నీ,  
అశాంతి చీకట్లనీ గమనించు,  
ఆకలి తీరక —  
ఒకరోజుని నిన్నే భక్షిస్తాయి  
అప్పుడు శాంతిస్తాయి !

— గన్ను కృష్ణమూర్తి

Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna.

# పిల్లల్లో ఆరోగ్యం ఉబికే ఉత్సాహం పొంగులు వారుతూంటే సరి

# వాళ్ళు చేసే అల్లరికూడా యిక ముచ్చటగానే ఉంటుంది మరి.

మాల్టోవా తాగే పిల్లల్లో అసలు ఎంత చురుకూ, ఉత్సాహం ఉంటుందంటే, దూరం నుంచే చూసీ చూడంగానే టక్కున గుర్తు పట్టెయ్యొచ్చు, వాళ్ళు 'మాల్టోవా పిల్ల'లని. వాళ్ళు జీవితంలోని ఏ రంగంలో నైనాసరే అందరికన్నా ఒక మెట్టు పైనే ఉంటారిక.

మరి మాల్టోవా ఎంతో రుచికరమైనది కూడాను. రుచిగా ఉండటమేగాకుండా అత్యంత పుష్టికరమైనది కూడాను. ప్రోటీన్, వైటమిన్లూ, ఖనిజ పదార్థాలతో సమృద్ధి అయినది యిది. దాంతో మీ పిల్లల శరీరం సరియైన తీరులో పెరుగుతుంది. వాళ్ళని ఆరోగ్యంగా ఉంచుతుంది. మాల్టోవాతో పిల్లల జీవితంలో ఎంత ఉత్సాహం పొంగులు వారుతుందంటే, వాళ్ళని అలా చూస్తూనే మీరిక సగర్వంగా సంతోషిస్తారు.




అత్యంత వైటమినులతో

## మాల్టోవా

ఆరోగ్యం, బలం మరియు శక్తి కోసం.



**JiL** జగత్‌జీత్ ఇన్‌డస్ట్రీస్ లిమిటెడ్

ASP/JIL/2315-81 Tel R